సామాన్యానికి తెలియజెప్పడానికి రాజ్య ప్రదర్శనాలను, జిల్లా ప్రదర్శనాలను ఏర్పాటు చేయడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. 1959–60 లో 4 జిల్లా స్థాయి పశుప్రదర్శనాలను ఒక్కొక్కరోజుపాటు జరపడానికి ఈ జిల్లాకు రు. 0.022 లక్ష మొత్తం కేటాయించబడింది.

## కోళ్ళ పరిశ్రమ విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు

భారత ప్రభుత్వం వారు ప్రారంభించిన పైలట్ ప్రాజెక్టు అభివృద్ధి పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలో 12 కోళ్ళ పరిశ్రమ విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు 1957–59 సంవత్సరాల కాలంలో ప్రారంభించబడినాయి. 1959–60 లో యింతా 4 కేంద్రాలను ప్రారంభించటానికి, యింతకు ముందు ప్రారంభించిన వాటిని కొనసాగించటానికిగాను ప్రతిపాదింపబడింది. ఇందుకు ప్రణాళికలో రు. 2 76 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.050 లక్ష యీ జిల్లాలో ఒక విస్తరణ కేంద్రాన్ని కొనసాగించేటందుకుగాను ప్రత్యేకించబడింది.

## మేకల పెంపక క్షేత్రం

పలమనేరులో ఉన్న ప్రభుత్వ పశుగణ క్షేత్రంలో మేకలను పెంచటానికి సౌకర్యాలున్నాయి. ఇందువల్ల యిక్కడ 1957-59 సంవత్సరాల కాలంలో ఒక మేకల పెంపక క్షేత్రం స్థాపించబడింది. ఈ పెంపక క్షేత్రంలో ప్రసిద్ధిచెందిన "జామ్నుపురి" రకపు యూనిట్లు నొకదాన్ని ప్రవేశపెట్టటానికి ప్రతిపాదింపబడింది. 1959–60 ప్రణాళికలో యీ క్షేత్రం కోసం రు. 0.57 లక్ష కేటాయించబడింది. వసతి గృహాలు నిర్మించటానికి, పరికరాల కొనుగోలు మొదలగు వాటి కోసం రు. 0.30 లక్ష మేకల పెంపక క్షేత్రాన్ని కొనసాగించుటకు రు. 0.27 లక్ష వినియోగించబడతాయి.

## వివిధ రకాల పశువుల సరఫరా

స్థానికంగా ఉండే పశుగణాన్ని అభివృద్ధి పరచే ఉద్దేశంతో రెండవ ప్రణాళికా కాలంలో రైతులకు తగ్గింపు రేట్లకు అంటే అసలు ఖరీదులో సగానికి ఆబోతులను, దున్నపోతులను, మేకలను, మేకపోతులను, పందులను, పోతుపందులను, పొట్టేళ్ళను, విదేశీకోడిపుంజుల్ని, పెట్టల్ని, గుడ్లను పంపిణీ చేయడానికి ఉద్దేశింపబడింది. 1959–60 లో ఈ జిల్లాలో పంచదలచుకున్న పశువుల సంఖ్య, అందుకయ్యే ఖర్చువివరాలు ప్రక్కపుటలో ఇవ్వబడినాయి.

| | | సంఖ్య | కేటాయించిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|---|
| 1. | ఆబోతుల సరఫరా | 9 | 0.0945 |
| 2. | దున్నపోతులు | 10 | 0.105 |
| 3. | మేకపోతులు | 7 | 0.008 |
| 4. | ఆడమేకలు | 10 | 0.008 |
| 5. | పోతుపందులు | 5 | 0.133 |
| 6. | ఆడపందులు | 2 | 0.006 |
| 7. | పొట్టేళ్ళు | 6 | 0.005 |
| 8. | విదేశీకోడిపుంజులు | 170 | 0.019 |
| 9. | విదేశీకోడిపెట్టలు | 170 | 0.019 |
| 10. | విదేశీజాతిగ్రుడ్లు | 300 | 0.0C3 |

## పలమనేరులోని పశుగణ క్షేత్రాన్ని పునర్వ్యవస్థీకరించటం

పశుగణ క్షేత్రాలలో వివిధజాతుల పశువులను పెంచటానికి, వాటిని పెంచటంలోగల సాధకబాధకాలను పరిశీలించటానికిగాను పలమనేరులో ప్రభుత్వ పశుగణ క్షేత్రం ప్రారంభించబడింది. 30 హల్లికర్ ఆవులను, రెండు ఎద్దులను ఈ క్షేత్రంలో పెంచటానికి తలపెట్టబడింది. వీటి పెంపకానికి, మేతకు, వీటికి వచ్చేవ్యాధులకు సంబంధించిన విషయాలను గురించి పరిశీలనలు జరపటానికి ఉద్దేశించబడింది. ఈ క్షేత్రంలో 100 విదేశీరకపు కోడిపెట్టలతోను 15 పుంజులతోను కూడిన ఒక కోళ్ల పెంపక యూనిట్టును తక్కువ వ్యయంతో ఏర్పాటుచేయటానికి కూడ ప్రతిపాదింపబడింది. ఈ యూనిటు నిర్వహణకు ఈ క్షేత్రంలో ఉత్పత్తి చేయబడే వస్తుసామగ్రి వినియోగించబడుతుంది. 1959–60 ప్రణాళికలో రు. 1.75 లక్షల మొత్తం ఈ పథకానికి కేటాయించబడింది.

## పశువైద్యశాఖ ప్రధాన కార్యాలయానికి, జిల్లా పశువైద్య కార్యాలయాలలో అదనపు సిబ్బంది నియామకం

పశువైద్యశాఖలో పని బాగా పెరిగింది. ఈ పనిని నిర్వహించడం కోసం అవసరమైన అదనపు సిబ్బందిని పశువైద్యశాఖ ప్రధాన కార్యాల

యంలోను, చింతలదీవి ప్రభుత్వ పశుగణ క్షేత్రంతో సహా జిల్లా పశువైద్య శాఖ కార్యాలయాల్లోను నియమించటానికి తలపెట్టబడింది. అందుకు 1959–60 ప్రణాళికలో రు. 0 72 లక్ష మొత్తం కేటాయించబడింది. ఆ మొత్తంలో ఈ జిల్లాకు రు. 0.043 లక్ష మొత్తం కేటాయించబడింది.

### *ఆంధ్ర పశువైద్య కళాశాల, తిరుపతి*

1955 లో బాపట్లలో స్థాపించబడిన పశువైద్య కళాశాల తిరుపతికి మార్చబడింది. 1959–60 ప్రణాళికలో యీ కళాశాలకుగాను రు. 18.52 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 16.00 లక్షల మొత్తం భవనాలు నిర్మించటానికి, పరికరాలు కొనుగోలుకు వినియోగించబడుతుంది. మిగత రు. 2.52 లక్షల మొత్తం నియమించబడిన సిబ్బందిని కొనసాగించటానికి వినియోగించబడుతుంది. 100 మంది విద్యార్థులతో కూడిన అయిదవ జట్టు కళాశాలలో యీ సంవత్సరం చేర్చుకోబడుతుంది.

### *రిండరుపెస్టు వ్యాధి నిర్మూలన పథకం*

దేశంలో గాళ్ల వ్యాధిని (రిండరుపెస్టు) నిర్మూలించే ఉద్దేశంతో భారత ప్రభుత్వంవారు వ్యాధిరాకుండా పశువులన్నిటికి టీకాలు వేయడానికి ఒక పథకాన్ని ప్రారంభించారు. ఈ టీకాల ఉద్యమం ద్వారా టీకాలు వేయబడకుండా మిగిలిపోయిన పశువులకోసం గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలలో టీకాలు వేయడానికిగాను మరొక పథకం కూడ మంజూరు చేయబడింది. ఆచరణలో ఎదురయ్యే చిక్కులు, మందు దొరకక పోవడంవంటి వాటి కారణంగా ఈ పని పూర్తి చేయడానికి వీలు లేకపోయింది. అందువల్ల ఈ తరుపరి ఉద్యమాన్ని పై జిల్లాలో కొనసాగించడానికి, మామూలు టీకాల ఉద్యమం ఈ సంవత్సరం పూర్తి కాగలదని ఆశించబడుతున్న కృష్ణానదికి ఉత్తరభాగపు జిల్లాలలో కూడా రెండవ పథకాన్ని ప్రారంభించడానికి తలపెట్టబడింది. ఈ పథకాన్ని అమలు పరచేటందుకు 1959–60 ప్రణాళికలో రు. 1.95 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.082 లక్ష ఈ జిల్లాకు కేటాయించబడింది.

### *క్లినికల్ లేబరేటరీలు*

రసాయనిక పరీక్షలను జరిపి, సకాలంలో వ్యాధులను కనిపెట్టి నిర్ధారణ చేయడంకోసం రాజ్యంలోని జిల్లా ప్రధాన పశువైద్య ఆసుపత్రులు, పశుగణ

క్షేత్రాలు ప్రతిదానిలోను క్లినికలు లేబరేటరీలను స్థాపించడానికి ప్రతిపాదింపబడింది. 1957–58 లో విశాఖపట్నం, కాకినాడ, నెల్లూరు, చిత్తూరు, కర్నూలులలోని ప్రధాన పశువైద్య ఆసుపత్రులలో ఐదు క్లినికలు లేబరేటరీలు ప్రారంభించబడ్డాయి. 1959–60 లో పశ్చిమగోదావరి, కృష్ణా, అనంతపురం జిల్లాలలో మరి 3 క్లినికల్ లేబరేటరీలను ప్రారంభించడానికి, ఇదివరకే ప్రారంభించబడిన పాత లేబరేటరీలను కొనసాగించడానికి తలపెట్టబడింది. అందుకు రు. 0.89 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. అందులో రు. 0.034 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

### సంచార పశువైద్యదళాలు, ప్రథమ చికిత్సా కేంద్రాలు, చిన్నతరహా పశువైద్యశాలలు, పశువైద్యశాలలు

గ్రామీణ ప్రాంతాలలోను, పట్టణ ప్రాంతాలలోను పశువులకు ఉత్తమ వైద్య సహాయాన్ని కలుగజేయడానికి, అంటువ్యాధులను కట్టుదిట్టంగా నివారించడానికిగాను ఈ పథకాలు ఉద్దేశించబడినాయి. 1959–60 సంవత్సరంలో ఇదివరకే ప్రారంభించబడిన పాతపశువైద్యశాలలను, సంచార పశు వైద్యదళాలను, ప్రథమచికిత్సా కేంద్రాలను కొనసాగించడమే కాకుండా జిల్లాలో రు. 0.299 లక్ష వ్యయంతో 2 చిన్నతరహా పశువైద్యశాలలను, ప్రారంభించడానికి తలపెట్టబడింది.

### జిల్లా పశువైద్యశాఖాధికార్లకు జీపుల సరఫరా

జిల్లా పశువైద్య శాఖాధికార్లు తరచుగాను, అకస్మాత్తుగాను తమ క్రింది సిబ్బంది పనిచేసే తావులకు వెళ్ళి వారు చేసేపనిని తనఖీచేసి వారిని అప్రమత్తులుగా ఉంచాలంటే వారికి జీపులుండడం ఎంతైనా అవసరం. అందుచేత 1959–60 ప్రణాళికలో రు. 0.54 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.14 లక్ష మొత్తం ఇదివరకే సరఫరా చేయబడిన జీపు నిర్వహాణకుగాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

### వెటర్నరీ కాంపౌండర్లకు శిక్షణ

వెటర్నరీ కాంపౌండర్ల కొరతను తీర్చటంకోసం 1959–60 లో 360 మందికి శిక్షణ ఇవ్వడానికి ప్రతిపాదింపబడింది. రెండుజట్లుగా ఆరుకేంద్రా

లలో ఈ అభ్యర్థులకు శిక్షణ యివ్వబడుతుంది. ప్రతి కేంద్రంలోను 60 మంది అభ్యర్థులు శిక్షణ పొందుతారు. ఈ పథకానికి 1959—60 లో కేటాయించ బడిన రు. 0.50 లక్ష మొత్తంలోను రు. 0.09 లక్ష మొత్తం 60 మందికి శిక్షణ ఇచ్చేటందుకు ఈ జిల్లాకు కేటాయించబడింది.

## పాడి పరిశ్రమ, పాల సరఫరా

### పట్టణ పాల సరఫరా పథకం

1959—60 లో చిత్తూరు, తిరుపతి పట్టణాలలో పాలసరఫరా విస్తృతం చేయటానికి తలపెట్టబడింది. చిత్తూరు సహకార పాలసరఫరా యూనియన్ ద్వారా పాలను సేకరించి ప్రాసెసింగు చేసిన తరువాత, చిత్తూరు తిరుపతి పట్టణాలలో ఉన్న ప్రజలకు, సంస్థలకు సరఫరా చేసేటందుకు, డెయిరీకి, ఎసెంబ్లింగు సెంటర్లకు భవనాలను నిర్మించేటందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 3.06 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ పథకాన్ని పూర్తిగా అమలు పరచిన నాటినుండి ఒక సంవత్సర కాలంలోగా ప్రస్తుతం రోజుకు 1493 పౌన్లు మాత్రం ఉన్న పాల ఉత్పత్తిని 12,000 పౌన్లకు పెంచే ఉద్దేశంతో యీ పథకాన్ని పర్యవేక్షించుటకు అవసరమైన పరిపాలక సిబ్బందిని, సాంకేతిక సిబ్బందిని నియమించుటకు ప్రతిపాదించబడింది.

## అడవులు

### కార్యాచరణ ప్రణాళికలు

ఈ జిల్లాలోని అడవుల డివిజన్లలో కార్యాచరణ పథకాల తయారీకి సంబంధించిన సర్వేపనిని, హద్దులను ఏర్పరచేపనిని నిర్వహించుటకుగాను 1959—60 సంవత్సరపు ప్రణాళికలో రు. 0.99 లక్ష కేటాయించబడింది.

### అడవుల పునరుద్ధరణ

అటవీశాఖ స్వాధీనపరచుకొన్న ఎస్టేటు, పంచాయతీ అడవుల ఉత్పాదక శక్తిని అభివృద్ధిపరచే ఉద్దేశంతో ఆ అడవులలో పునరుద్ధరణ క్షేత్రాలు ఏర్పరచబడినాయి. ఈ జిల్లాలో ఇంతకుముందు ఏర్పరచిన వాటిని నిర్వహించడమే కాకుండా 160 ఎకరాలలో క్రొత్తగా పునరుద్ధరణ క్షేత్రాలను ఏర్పరచడానికి, పాత క్షేత్రాలను నిర్వహించటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.169 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది.

## రిజర్వు అడవులలో చెట్టు చేమ నశించిన కొండలమీద అడవుల పెంపకం

భూసారం కొట్టుకొని పోకుండా నివారించే నిమిత్తం యీ పథకం క్రింద రిజర్వు అడవులలో చెట్టుచేమ నశించిన కొండవాలులలో గట్లు వేసే పద్ధతిని అటవీ పెంపక క్షేత్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ జిల్లాలో యింకా 10 ఎకరాల ప్రదేశంలో యీ అటవీ పెంపక కార్యక్రమాన్ని అమలు పరచేటందుకు, పాత క్షేత్రాలను నిర్వహించేటందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 0.01 లక్ష కేటాయించబడింది.

## కలప రవాణా నిబంధనలను అమలుపరచటం

కలపను దొంగరవాణా చేయకుండా నివారించడానికిగాను కలపను ఒక చోటునుండి మరొక చోటకు చేర వేయడం మీద కట్టుదిట్టమైన పర్యవేక్షణ జరపడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. 1959—60 లో ఆంధ్ర ప్రాంతపు డివిజన్లు అన్నింటిలోను 80 మంది తానాదార్లు నియమించబడతారు. ఇందుకు ప్రణాళికలో రు. 0.35 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.0612 లక్ష మొత్తం 14 మంది తానాదార్ల నియామకానికిగాను ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## భవనాల నిర్మాణం

ఈ జిల్లాలో పనిచేస్తున్న అటవీశాఖ తాబేదారీ సిబ్బందికి నివాస గృహావసతి లేనందువల్ల యీ పథకం క్రింద రు. 0.15 లక్ష ఖర్చుతో వారి కోసం ఈ సంవత్సరంలో 3 నివాసగృహాలను నిర్మించటానికి ప్రతిపాదింపబడింది.

# భూసార రక్షణ

## రిజర్వు అడవులకు వెలుపలనున్న చెట్టుచేమ నశించిన కొండలమీద అడవుల పెంపకం

రాయలసీమ జిల్లాలలో రిజర్వు అడవులకు వెలుపల ఉన్న చెట్టు చేమ నశించిన కొండలమీద అడవులను పెంచడానికి యీ పథకం ఉద్దేశించ

బడింది. రకరకాల భూసారం వివిధ సాంద్రతలలో కొట్టుకొని పోకుండా భూసార రక్షణ చర్యలు తీసికోవడమే ఈ పథకం యొక్క లక్ష్యం. ఈ జిల్లాలో 90 ఎకరాల భూమిలో అడవులను పెంచటం కోసం ఈ సంవత్సరానికి రు. 0.175 లక్ష కేటాయించబడింది.

## పదిఎకరాల క్షేత్రాలలో మెట్టుసాగు పద్ధతుల్ని వివరించే పైలట్ ప్రదర్శన ప్రాజెక్టులను ఏర్పాటుచేయటం

సాలోపుగట్లు (కాంటూరు బండ్లు) వేసిన ప్రాంతాలలో వ్యవసాయదార్లు మెట్టసాగు పద్ధతుల్ని అవలంబించేటట్టు ప్రోత్సహించే నిమిత్తం వారికి ఎకరానికి రు. 15 లు చొప్పున సబ్సిడీ యివ్వడానికి ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. 300 ఎకరాల ప్రదేశంలో ఏర్పాటు చేయబడే 30 క్షేత్రాలలో మెట్టసాగు పద్ధతుల్ని ప్రవేశపెట్టేందుకుగాను 1959-60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 0.049 లక్ష కేటాయించబడింది.

# మత్స్య సంవర్ధన

## అధికంగా చేప పిల్లలను సేకరించడం, పంపిణీ చేయడం

చేప పిల్లలను, అందులోను త్వరితంగా పెరిగే వాటిని, అవి సమృద్ధిగా దొరికే గోదావరి, కృష్ణానదులనుండి, తూర్పుగోదావరి, పశ్చిగోదావరి, కృష్ణా, గుంటూరు డెల్టా జిల్లాలలోని నీటిపారుదల కాలవలనుండి సేకరించి మత్స్య ఉత్పత్తిని అధికం చేయడానికిగాను రాజ్యంలోని జలాశయాల్లో నిల్వ చేయడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1957-58 లో కొంత అదనపు సిబ్బందిని నియమించడమే కాకుండా, సేకరణ కేంద్రాలనుండి నిల్వచేసే ప్రాంతాలకు చేపలను చేరవేసేటందుకు 12 వ్యాన్లు కొనబడ్డాయి. ప్రస్తుతం ఉన్న సిబ్బందితోను, వ్యానులతోను 1959-60 లో రెండుకోట్ల చేప పిల్లల్ని సేకరించడానికి తలపెట్టబడింది. అందుకోసం ప్రణాళికలో రు. 1.93 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.07 లక్ష మొత్తం 5 లక్షల చేప పిల్లల్ని సేకరించడానికి గాను ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## చేపల మార్కెట్లు

రాజ్యంలోని చేపల మార్కెట్లలో ఎక్కువ భాగం పారిశుధ్యమనేదే లేని పరిస్థితులలో అసహ్యాకరంగా ఉండే ప్రదేశాలలో ఉన్నాయి. చేపల మార్కెట్లను నిర్మించి వాటిని పరిశుభ్రమైన స్థితిలో ఉంచవలసిన బాధ్యత మామూలుగా స్థానికసంస్థలు, మున్సిపాలిటీలదే అయినప్పటికి వాటి ఆదాయ మార్గాలు తక్కువగా ఉండడంవల్ల వాటికి సబ్సిడీలను ఇచ్చి మార్కెట్ల నిర్మాణం విషయంలో సహాయపడడానికి తలపెట్టబడింది. 1959-60 లో ఆంధ్ర ప్రాంతంలో 5 పెద్ద చేపల మార్కెట్లను, 5 చిన్న వాటిని నిర్మించడానికి స్థానికసంస్థలకు, మునిసిపాలిటీలకు సబ్సిడీ ఇవ్వడానికి గాను రు. 1.23 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో ఈ జిల్లాలో ఒక మార్కెటుకు నిర్మాణానికిగాను ప్రభుత్వం ద్రవ్య సహాయం చేస్తుంది.

## మత్స్య క్షేత్రాలు

పెంపకానికి ఉపకరించే చేపలను, విదేశీ రకం చేపలను నిల్వచేయటం కోసం యీ సంవత్సరంలో 3 మత్స్య క్షేత్రాలను నిర్మించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో .రు. 1.55 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో ఒక క్షేత్రం ఈ జిల్లాలో రు. 0.50 లక్ష ఖర్చుతో నిర్మించబడుతుంది.

## క్రొత్తరకం నైలాను వలలు

ప్రస్తుతం బెస్తలు ప్రత్తితోను, జనుముతోను చేసిన వలలను వాడుతున్నారు. ఇవి అంత మన్నికైనవి కావు. తరచుచేపలు వలలు తెంపుకుని పోవడం కూడా జరుగుతున్నది. తత్ఫలితంగా బెస్తలు వారు పడ్డ శ్రమకు తగిన ఫలితం పొందడంలేదు. నైలాను వలలు బాగా పని చేస్తున్నటు కనుగొనబడింది. అందువల్ల 200 నైలాను వలలను అసలు ఖరీదులో మూడవవంతు ఖరీదుకు 1959-60 లో బెస్తలకు పంపకం చేయడానికి ఉద్దేశించబడింది. వీటి ఖరీదు చేపలు పట్టని కాలం వదలి 5 సంవత్సరాల కాలపరిమితితో తేలిక వాయిదాలలో వారినుండి వసూలుచేయబడుతుంది. ఆ 200 వలలలో 10 వలలు ఈ జిల్లాలో పంపిణీ చేయబడతాయి.

*బెస్తవారికి దుంగల సరఫరా*

తమ దగ్గరున్న నాటుదుంగలు పాతవైనప్పటికీ కూడ పేదరికంవల్ల, దుంగల ఖరీదు అధికం కావడంవల్ల, బెస్తలు క్రొత్తవాటిని కొనుక్కోలేక పోతున్నారు. ఇందువల్ల 1959–60 లో 320 దుంగలను ఈ పథకం క్రింద పంపిణీ చేయడానికి ఉద్దేశించబడింది. కొన్నధరలో మూడవవంతు ఖరీదుకు ఇవి సరఫరా చేయబడతాయి. ఈ ఖరీదు 5 సంవత్సరాల కాలపరిమితితో తేలిక వాయిదాల మీద వసూలు చేయబడుతుంది. అందులో 20 దుంగలు ఈ జిల్లాలో పంపిణీ చేయబడతాయి.

## సహకారం, గిడ్డంగులు, మార్కెట్లు

*గ్రామీణ పరపతి సంఘాల విస్తరణ*

ఇది కొనసాగుతు వస్తున్న పథకం. అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘం వారి సిఫార్సులకు అనుగుణంగా రాజ్యంలోని గ్రామీణ పరపతి సంఘాలను పునర్వ్యవస్థీకరించడం, పటిష్ఠం చేయడం, విస్తరింప చేయడం ఈ పథకం యొక్క ఉద్దేశాలు. సహకారశాఖలో సిబ్బందిని పటిష్ఠం చేయడం, సెంట్రల్ బ్యాంకులు, పెద్ద తరహా సంఘాలు నియమించిన అదనపు పర్యవేక్షక, నిర్వాహక సిబ్బందికయ్యే ఖర్చుకు ద్రవ్య సహాయం చేయడం ద్వారా ఈ పథకం రెండవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలో అమలుపరచబడింది.

జాతీయ అభివృద్ధిమండలివారు సహకార విధానాన్ని గురించి ఒక తీర్మానం చేశారు. గ్రామీణులతో సహకార సంఘాల నిర్మాణం జరగాలని అందు వారు వక్కాణించారు. ఈ తీర్మానం దృష్ట్యా ఈ సంవత్సరంలో అదనంగా పెద్దతరహా సంఘాలు, గ్రామీణ బ్యాంకులు స్థాపించబడవు. కాని ఆంధ్రప్రాంతంలో ప్రస్తుతం ఉన్న 500 చిన్నతరహా సంఘాలను పటిష్ఠం చేయడమే కాకుండా క్రొత్తగా 350 చిన్న సంఘాలను ఏర్పాటు చేయడానికి కూడ ఉద్దేశింపబడింది. నూటికి 82 గ్రామాలు, నూటికి 38 మంది గ్రామీణ ప్రజలు ఈ పథకం క్రిందికి ఈ సంవత్సరం అంతమయ్యేలోగా తీసికొనిరాబడతారు. స్వల్పకాలిక, మధ్య కాలిక ఋణాలు కూడా ఇవ్వబడతాయి. రు. 1,020 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు, రు. 100 లక్షల

వరకు మధ్యకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. రిజిస్ట్రారుకు ఆర్థిక సలహాదారు అని వ్యవహరింపబడే ఒక జాయింటు రిజిస్ట్రారు కూడా ప్రధాన కార్యాలయంలో నియమించబడతారు. ఆయన గ్రామీణ పరపతి పథకంపై ప్రత్యేకంగా అజ్మాయిషీ వహిస్తారు.

ఈ జిల్లాలో అమలుజరపబడే కార్యక్రమం క్రింది విధంగా ఉంటుంది. 100 క్రొత్త చిన్నతరహా సంఘాలను ఏర్పాటుచేయడం, నిర్వహించడం, ప్రస్తుతమున్న చిన్నతరహా సంఘాలను పటిష్ఠం చేయడం, పాత సంఘాలలో 13,600 సభ్యులను, క్రొత్త సంఘాలలో 5,000 మంది సభ్యులను చేర్పించడం, రు. 69 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలను, రు. 10 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలను ఇవ్వడం జరుగుతుంది.

పై కార్యక్రమాన్ని అమలుపరచటానికి రు. 89,574/-ల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ మొత్తం క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| | రూపాయలు |
|---|---|
| 1. చిన్నతరహా సంఘాలకు సబ్సిడీలు. | |
| (ఎ) 1958—59 లో ప్రారంభించబడిన సంఘాలకు | 3,900 |
| (బి) 1959—60 లో ఏర్పరచబడే క్రొత్త సంఘాలకు | 6,500 |
| 2. (ఎ) పెద్దతరహా సంఘాలకు సబ్సిడీలు. | 24,600 |
| (బి) గ్రామీణ బ్యాంకుల కోసం సీనియరు ఇన్‌స్పెక్టర్ల నియామకంక్రింద అయ్యే ఖర్చు | 4,100 |
| 3. ఈ క్రింది వాటికిగాను సెంట్రల్ బ్యాంకులకు సబ్సిడీ. | |
| (ఎ) ఇదివరకు నియమించబడిన పాత సూపరువైజర్లకు. | 7,000 |
| (బి) 1959-60లో నియమించబడే క్రొత్త సూపరువైజర్లకు. | 3,000 |
| 4. అదనపు సిబ్బంది క్రింద ఖర్చు. | |

| | | |
|---|---|---|
| (ఎ) | ప్రణాళికలోని మొదటి రెండు సంవత్స రాలలో నియమించబడిన క్రెడిట్ సీనియరు ఇనస్పెక్టరు, జూనియరు ఇనస్పెక్టర్లు. | 7,090 |
| (బి) | పైలట్ పథకానికిగాను సిబ్బంది నియామకం. | — |
| (సి) | పరపతి విస్తరణ కార్యక్రమానికి కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రార్ల నియామకం. | 8,400 |
| (డి) | కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారులు (సి.డి.), సూపర్వైజర్లు, జవానులు. | 10,600 |
| (ఇ) | ఆడిటును వేరుచేయడానికి సిబ్బంది | 8,344 |
| (ఎఫ్) | 1959-60 లో డిప్యూటీ రిజిస్ట్రార్ల సర్కిళ్ళు ప్రతిదానిలోను ఒక్కొక్క జూనియరు ఇన్స్పెక్టరు నియామకానికి | 2,440 |
| | మొత్తం | 85,974 |

## భూమి తనఖాబ్యాంకుల అభివృద్ధి

నీటిపారుదల వసతి కల్పించడం, భూమిని సాగుక్రిందకు తీసుకరావటం మొదలైనటువంటి శాశ్వతమైన అభివృద్ధిపనులను భూములలో చేయటం కోసం యీ పథకం క్రింద ప్రాథమిక భూమి తనఖాబ్యాంకుల ద్వారా 25 సంవత్సరాలలో తీర్చుకోదగ్గ దీర్ఘకాలిక ఋణాలు రైతులకు ఇవ్వబడతాయి. ఈ సంవత్సరం రు. 5.70 లక్షలవరకు ఈ జిల్లాలో దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. ఈ సంవత్సరం ఈ జిల్లాకు కేటాయించబడిన రు. 6,300 మొత్తం ఈ క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | ప్రణాళికయొక్క మొదటి మూడు సంవత్స రాలలో ప్రాథమిక భూమి తనఖా బ్యాంకు లలో నియమించబడిన అదనపు సూపరువైజర్లకయ్యే ఖర్చు | 1,200 |
| 2. | ఈ సంవత్సరంలో నియమించబడే అదనపు సూపరువైజర్లకయ్యే ఖర్చు | 1,100 |

| | | |
|---|---|---|
| 3. | భూమి తనఖా బ్యాంకుల పర్యవేక్షణకోసం నియమించబడే కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రార్లకు, వారి జవానులకు అయ్యే ఖర్చు | 4,000 |
| | మొత్తం | 6,300 |

## సహకార పద్ధతులపై క్రయ విక్రయాల అభివృద్ధి

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. సహకార పద్ధతులపై వ్యవసాయోత్పత్తుల సహకార మార్కెటింగును అభివృద్ధి పరచడానికి ఉద్దేశించబడింది. వ్యవసాయ దారులకు, ప్రత్యేకించి చిన్నరకం, మధ్యరకం ఉత్పత్తి దార్లకు, ఈ పథకం క్రింద స్టోరేజి, గిడ్డంగి, ప్రోసెసింగు సౌకర్యాలు, క్రయ విక్రయ సౌకర్యాలు ఏర్పాటు చేయబడతాయి. క్రయ విక్రయ సంఘాల ద్వారా రసాయనిక ఎరువులను, అవసరమయ్యే ఇతర పదార్థాలను సరఫరా చేయడమే కాకుండా ఉత్పత్తుల మీద రైతులకు స్వల్పకాలిక ఋణాలుకూడా ఇవ్వబడతాయి. గ్రామ స్థాయిలో ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలకు, మండీ కేంద్రాలలో పనిచేస్తున్న మార్కెటింగు సంఘాలకు సన్నిహిత సంబంధాల్ని చేకూర్చడానికి కూడా ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది.

ఈ పథకం యొక్క పై లక్ష్యాలను సాధించడానికి రెండవ ప్రణాళికలో ప్రాథమిక మార్కెటింగు సంఘాలను పునర్వ్యవస్థీకరించి, పటిష్ఠం చేయడానికి ఉద్దేశించబడింది. అంతేకాకుండా మండీ కేంద్రాలలో ప్రధాన గిడ్డంగులు, గ్రామస్థాయిలో సహాయక గిడ్డంగులను నిర్మించడానికి, ప్రత్తి జిన్నులు, నూనెమిల్లులు, చెరకుగానుగలు వంటి ప్రోసెసింగు యంత్రాలను స్థాపించడానికి, సంఘాలకు ఆర్థిక సహాయం చేయటానికి కూడ ఏర్పాటు చేయబడింది: ఈ కార్యక్రమాలలో రాజ్యప్రభుత్వం పాల్గొంటుంది. శిక్షణ పొందిన సిబ్బంది సహాయం, ఆర్థిక సహాయం యీ సంఘాలకు లభ్యం చేయబడుతుంది. ఈ సంవత్సరంలో ఈ జిల్లాలో అమలు జరుపబడే కార్యక్రమం ఈ క్రింద వివరించబడింది.

| | | |
|---|---|---|
| 1. | వ్యవసాయోత్పత్తిపై ఋణాలను ఇవ్వడం (రూపాయలు లక్షలలో) | 30.00 |

| | | |
|---|---|---|
| 2. | క్రయ విక్రయ సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు ( సంఖ్య ) | — |
| 3. | పెద్ద తరహా సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు ( సంఖ్య ) | 6 |
| 4. | స్థాపించబడే ప్రాసెసింగు ప్లాంటులు (సంఖ్య) | 2 |

పై కార్యక్రమాన్ని అమలుపరచడానికి ఈ జిల్లాకు రు. 3.080 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ దిగువ తెలిపిన విధముగా పై మొత్తం వినియోగించబడుతుంది.

| | | రు. లక్షలలో |
|---|---|---|
| 1. | ప్రాథమిక మార్కెటింగు సంఘాలకు వాటా మూలధనంక్రింద విరాళం | 0.750 |
| 2. | జిల్లా మార్కెటింగు సంఘాలకు వాటా మూలధనంక్రింద విరాళం | 0.400 |
| 3. | ప్రాథమిక మార్కెటింగ్ సంఘాలకు మేనేజిరియల్ సిబ్బందికి గాను సబ్సిడీ | |
| (ఏ) | గత 3 సంవత్సరాలుగా సిబ్బందిని నియమించిన సంఘాలకు. | 0.060 |
| (బి) | 1959—60 లో సిబ్బంది నియమించే సంఘాలకు | 0.030 |
| 4. | పెద్ద తరహా సంఘాలకు గిడ్డంగులు | |
| (ఏ) | గత సంవత్సరాలలో ప్రారంభించిన గిడ్డంగుల నిర్మాణాన్ని పూర్తి చేయడానికి | 0.340 |
| (బి) | 1959—60 లో నిర్మాణం ప్రారంభించబడే క్రొత్త గిడ్డంగులకు | 0.090 |
| 5. | ప్రాసెసింగు ప్లాంటులను స్థాపించడం | 0.900 |
| | మొత్తం | 3.080 |

## పరిశోధన, పరిశీలన, గణాంక వివరాలు

ఈ పథకం క్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకారశాఖ ద్వారా అమలు జరుపబడే వివిధ పథకాలవల్ల ప్రజలకు కలిగిన లాభాలను, ఆ పథకాలను అమలుజరపడంలో తెలియ వచ్చిన లోటుపాట్లను పరిశీలించటానికి, సూత్రవిధానాలను రూపొందించ డానికి, సహకార వ్యవస్థలో ఏవైనా లోటుపాట్లు ఉంటే వాటిని సరిదిద్దు కొనేటందుకు మార్గాలను సూచించటానికి ఈ విభాగం కృషిచేస్తుంది. 1957–58 లో ఈ పథకం అమలు జరుపబడింది. దానిననుసరించి గణాంక వివరాలను సేకరించి, సంకలనం చేయడం కోసం జిల్లాలలో 20 మంది సీని యరు ఇనస్పెక్టర్లను నియమించటం, ప్రధాన కార్యాలయంలో ఒక సెక్షను ఏర్పాటు చేయటం జరిగింది. ఈ పథకం 1958–59 లో కూడా కొనసాగించ బడింది.

జిల్లాలలోని సిబ్బందికి సలహాలనిచ్చి, అజ్మాయిషీ వహించడం కోసం రిజిస్ట్రారు అఫీసులో డిప్యూటీ రిజిస్ట్రారు గ్రేడులో ఒక స్టాటిస్టీషియనును, ఇద్దరు సీనియరు ఇన్స్పెక్టర్లను, ఇద్దరు జూనియరు ఇన్స్పెక్టర్లను, ఇద్దరు జవానులను క్రొత్త సర్కిళ్ళకోసం 12 మంది సీనియర్ ఇన్స్పెక్టర్లను, ఒక్కొక్క సర్కిలు ఆఫీసుకు ఒక్కొక్కరు చొప్పున 46 మంది లోయరు డివిజను గుమాస్తాలను 1959–60 లో నియమించడానికి ఉద్దేశించబడింది. క్రొత్త విధానాలను రూపొందించడానికి, వాటిని అమలు పెట్టడానికి తగిన కార్యవిధానాన్ని రూపొందించేటందుకుగాను సహకార శాఖలో పరిశోధన, పరిశీలన, ప్రచార విభాగం ఒకటి ఏర్పాటు చేయబడుతుంది. ప్రారంభంలో ఈ విభాగానికి ముగ్గురు సహకార సబ్ రిజిస్ట్రార్లు, ముగ్గురు జవానులతో కూడిన కొద్దిపాటి సిబ్బందిని నియమించడానికి ఉద్దేశించబడింది. పై కార్య క్రమాన్ని అమలు పరచడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.34 లక్ష హెడ్ ఆఫీసులో నియమించడానికి ఉద్దేశించబడిన సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద, ప్రచారం మొదలైన వాటి కయ్యే ఖర్చు క్రింద ప్రత్యేకించబడింది. మిగిలిన రు. 1.36 లక్షల కేటాయింపులోను రు. 6,044 ల మొత్తం ఈ జిల్లాలో నియమించబడే సిబ్బంది ఖర్చు క్రింద కేటాయించబడింది.

## సభ్యులు, పంచాయతీదారులు మొదలైన వారికి శిక్షణ

అఖిల భారత సహకార సమాఖ్య ద్వారా భారత ప్రభుత్వం వారు ారంభించిన పథకపు పద్ధతి మీద ఈ పథకం కూడ రూపొందించబడింది. హకార సూత్రావళి, వాటి ఆచరణ, లెక్కలను వ్రాసి యుంచడం, సంస్థల ర్వహణ మొదలైన విషయాలలో రెండు మూడు రోజులపాటు గ్రామీణ రపతి సంఘాల సభ్యులకు, సుమారు ఒక వారంరోజులుపాటు పంచాయతీ ారులకు, సుమారు 5 నుండి 6 వారాలపాటు సంఘాల కార్యనిర్వా కులకు, జీతం మీద పనిచేసే ఉద్యోగులకు శిక్షణ ఇవ్వడానికి ఈ పథకం ద్దేశించబడింది. 1959–60 లో ఈ జిల్లాలోని 1000 మంది సభ్యులకు, 300 ంచాయితీదారులకు, 40 మంది కార్యనిర్వాహకులకు శిక్షణ ఇచ్చేటందుకు . 5856/- ల మొత్తం కేటాయించబడింది.

## సహకార వ్యవసాయం

ఈ పథకంక్రింద భూముల్లేని వ్యవసాయకూలీలను సహకార వ్యవ ాయ సంఘాలను ఏర్పాటు చేయడం ద్వారా వ్యవసాయంలో స్థిరపడేట్టు సి, వారికి పునరావాసం కల్పించటానికి, వాటా మూలధనం క్రింద, ఎద్దుల ొనుగోలుకు, భూమిని వ్యవసాయయోగ్యంగా చేసి అభివృద్ధిపరచడానికి, వ్యవసాయ పనిముట్లు కొనుగోలుకు అయ్యే ఖర్చుకుగాను ఋణాలు, ాంటుల రూపంలో ఆర్థిక సహాయం కలుగచేయడానికి ప్రతిపాదింపబడింది. ు సంవత్సరపు ప్రణాళికలో ఆంధ్రప్రాంతానికి రు. 1.34 లక్షలు, తెలం ాణా ప్రాంతానికి రు. 0.88 లక్ష–మొత్తం రు. 2.22 లక్షలు కేటాయించ డ్డాయి. ఇందులో రు. 0.28 లక్ష మొత్తం, సహకార సేద్యానికి సంబం ంచిన పనికోసం ప్రధాన కార్యాలయంలో నియమించబడిన సిబ్బందికయ్యే ర్చు క్రింద వినియోగించబడుతుంది. మిగిలిన మొత్తంలో రు. 6,500/–లు ు జిల్లాకు కేటాయించబడ్డాయి. ఈ సంవత్సరంలో ఈ జిల్లాలో ఏర్పాటు యబడే క్రొత్తసంఘాలకు ఆర్థిక సహాయం చేయడానికి ఈ డబ్బు నియోగించబడుతుంది. ఈ జిల్లాలో ఒక క్రొత్త సంఘం 100 మంది భ్యులతో ఏర్పాటు చేయబడుతుంది. ఈ సంవత్సరములో. 500 ఎకరాల ామి సాగు చేయబడుతుంది.

## రాజ్యా గిడ్డంగి సంస్థ
## (స్టేటు వేరుహౌసింగు కార్పొరేషను)

దేశంలో గిడ్డంగి సౌకర్యాన్ని అభివృద్ధిచేయాల్సిన ఆవశ్యకత గురించి అనేక కమిటీలు, కమిషన్లు అనేకసార్లు నొక్కి చెప్పాయి. పరపతి, పరపతే తర సంఘాల కార్యకలాపాలకు సంబంధాన్ని కలుగచేసే ముఖ్యమైన సంస్థలే గిడ్డంగులు. అందువల్ల, భారత ప్రభుత్వం వారు కేంద్ర గిడ్డంగి కార్పొరేషనును స్థాపించారు. దీనికి అనుబంధంగా రాజ్య ప్రభుత్వాలను తమ తమ రాజ్యాలలో గిడ్డంగి సంస్థలను ఏర్పాటు చేయవలసిందిగా కేంద్ర ప్రభుత్వంవారు సలహానిచ్చారు. ఇవి గిడ్డంగుల బోర్డు అధ్వర్యం క్రింద పని చేస్తాయి. గిడ్డంగులిచ్చే రసీదులు నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్లుగా పరిగ ణించబడతాయి. వాటిని ధరావతుగా ఉంచుకొని బ్యాంకులు, గిడ్డంగులలో వ్యవసాయ ఫలసాయాన్ని దాచుకొనే వారికి బ్యాంకులు పరపతి సౌక ర్యాన్ని కలుగచేస్తాయి. అందువల్ల 1958–59లో రాజ్య గిడ్డంగి కార్పొరే షను ఈ రాజ్యంలో స్థాపించబడింది. కార్పొరేషనుకు వాటా మూలధనం క్రింద ప్రభుత్వం వారు రు. 2.50 లక్షల మొత్తం పెట్టుబడి పెట్టారు. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రణాళికలో రు. 5 లక్షలు, తెలంగాణా ప్రణాళికలో మరొక రు. 5 లక్షలు ఈ కార్పొరేషనుకు వాటా మూలధనంక్రింద పెట్టుబడి పెట్టడానికి కేటాయించారు. ఈ పథకం క్రింది ప్రయోజనాలు ఈ జిల్లాలోని రైతులకు కూడా లభ్యమౌతాయి.

# వివిధ విషయాలు

## కమతాల ఏకీకరణ

ఆంధ్రప్రాంతంలో కమతాల ఏకీకరణను ప్రారంభించటంకోసం కొన్ని ఆంధ్ర జిల్లాలలోని పరిస్థితులను పరిశీలించి పరిపాలన, శాసననిర్మాణానికి సంబంధించినట్టి తగిన ప్రతిపాదనలను సమర్పించవలసిందిగా కమతాల ఏకీ కరణ కార్యక్రమాన్ని నిర్వహించటానికి నియమించబడిన స్టేట్ డైరెక్టరును కోరడం జరిగింది. హైదరాబాదు కమతాల ఏకీకరణ చట్టాన్ని ఆంధ్ర ప్రాంతానికి కూడ విస్తరింపచేయటం కోసం విధాన సభలో ఒక బిల్లు కూడ ప్రవేశపెట్టబడింది. శాసన నిర్మాణం జరిగిన వెంటనే కమతాల ఏకీకరణ చర్యలు 1959–60 లో మూడు జిల్లాలలో–చిత్తూరు, శ్రీకాకుళం, విశాఖ పట్టణం జిల్లాల్లో–తీసికోబడతాయి. ఇందుకుగాను 1959–60 ప్రణాళికలో

రు. 3.00 లక్షల మొత్తం (జిల్లాకు లక్షరూపాయల చొప్పున) కేటాయించ బడింది.

## జాతీయ విస్తరణ సేవాకేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు

1959 వ సంవత్సరం మార్చి నెల అంతం నాటికి యీ జిల్లాలో 8 మొదటి దశబ్లాకులు, 4 రెండవదశబ్లాకులు, ఒక సామాజికాభివృద్ధి బ్లాకు, రెండు ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు ఉన్నాయి. వీటి వైశాల్యం 3131.63 చదరపుమైళ్ళు; జనాభా 9,95,670; ఈ కేంద్రాలలోని గ్రామాల సంఖ్య 1,239. భారత ప్రభుత్వం వారి నిర్ణయానుసారం, 1959 సంవత్సరం ఏప్రెలు నెలనుండి ఏర్పాటు చేయబడే ప్రతిబ్లాకులో కూడ ప్రత్యేకంగా వ్యవసాయ రంగంలో ఒక సంవత్సరం పాటు తీవ్రకృషి (ప్రీ-ఎక్స్‌టెన్షన్ కార్యక్రమము) జరిగి ఉండాలి. అదే ప్రకారం యీ జిల్లాలోని చౌడపల్లి, గంగాధర నెల్లూరు బ్లాకులలో వరుసగా 1-4-1958, 2-10-1958 తేదీలనుండి ప్రీ-ఎక్స్‌టెన్షన్ కార్యక్రమం మొదలు పెట్టబడింది. 1-4-1958 నాటినుండి ప్రీ-ఎక్స్‌టెన్షన్ కార్యక్రమాన్ని ప్రారంభించినబ్లాకు 1-4-1959 నుండి మొదటిదశ బ్లాకుగా రూపొందింది. 2-10-1958 తేదీనుండి యీ కార్యక్రమం మొదలు పెట్టినబ్లాకు 1959 సంవత్సరం అక్టోబరు నెల 2 వ తేదీనుండి మొదటిదశ బ్లాకుగా ప్రారంభించబడుతుంది. ఇంతేకాక నగరి సామాజికాభివృద్ధిబ్లాకు 1-4-1959 తేదీనుండి రెండవదశబ్లాకులుగా మార్పుచెందింది. 1959-60లో యీ రాజ్యానికి 36 ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు కేటాయించబడినాయి. ఇందులో 18 బ్లాకులు 1-4-1959 నాడు, మిగతవి 2-10-1959 నాడు ప్రారంభించబడినాయి. ఇందులో మదనపల్లి, పూత్తూరు బ్లాకులు యీ జిల్లాలో ఉన్నాయి. అవి వరుసగా 1-4-1959, 20-10-1959 తేదీలలో ప్రారంభించబడినాయి. ఈ విధంగా 1-4-1959 నాటికి యీ జిల్లాలో 9 మొదటిదశబ్లాకులు, 5 రెండవదశబ్లాకులు, 2 ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు ఉన్నాయి.

ఈ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలుపరచడంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో ఋణాల పద్దు క్రింద రు. 6,59,600 లు, గ్రాంటుపద్దు క్రింద రు. 13,45,400/– లు, మొత్తం రు. 20,05,000/- లు కేటాయించబడినాయి.

1–4–1959 వ తేదీనాటికి ఈ జిల్లాలో వున్న బ్లాకులను చూపే పటం ఈ ప్రక్క పుటలో ఇవ్వబడింది.

---


చిత్తూరు జిల్లా
1.4.59 తేదీనాటికి ఉన్న
సామూహికాభివృద్ధి ప్రాంతాలు
సూచన
రాజ్యసరిహద్దు
జిల్లాసరిహద్దు
తాలూకాసరిహద్దు
బ్లాకు సరిహద్దు
బ్లాకు కేంద్రం
మొదటిదశబ్లాకులు
రెండవదశబ్లాకులు
ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు
కడప జిల్లా
అనంతపురం జిల్లా
నెల్లూరు జిల్లా
మదరాసు రాజ్యము
మైసూరు రాజ్యము
గంగాధరనెల్లూరు
కుప్పం
నగరి

# పంచాయితీలను పటిష్ఠం చేయటం

## సిబ్బంది పథకం

పంచాయతీలను పటిష్టం చేసే ఉద్దేశంతో, జిల్లాస్థాయిలో జిల్లా పంచాయతీ అఫీసరును, రెవిన్యూ డివిజను స్థాయిలో డివిజనల్ పంచయతీ అఫీసరును, తాలూకా స్థాయిలో బ్లాకు ప్రాంగాలను మినహాయించి డిప్యూటీ పంచాయతీ ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయతీలకు విస్తరణాధికార్లను నియమించడం ద్వారాను, జిల్లా పంచాయతీ ఆఫీసర్ల కార్యాలయంలలో అదనపు సిబ్బందిని నియమించడం ద్వారాను 1958–59 సంవత్సరంలో పంచాయతీ పరిపాలనకు సంబంధించిన పర్యవేక్షక, నిర్వాహక సిబ్బంది వ్యవస్థ పునర్వ్యవస్థీకరించ బడింది. 1959–60 ప్రణాళికలో రు. 8.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.120 లక్ష ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను కార్యాలయంలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకు, రు. 0.191 లక్ష పడమర, తూర్పు ఇనస్పెక్టింగ్ ఆఫీసర్ల కార్యాలయాలలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకు గాను ప్రత్యేకించ బడినాయి. అదనంగా ఖర్చుపెట్టాల్సిన అవసరం ఉండే జిల్లాలకు తిరిగి పంపకం చేసే నిమిత్తం ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ అధీనంలో రు. 0.524 లక్ష ఉంచబడింది. మిగిలిన రు. 7.165 లక్షలలో రు. 0.2155 లక్ష 1958–59 సం॥లో యీ జిల్లాలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించే నిమిత్తం ప్రత్యేకించబడింది.

## శిక్షణ పథకం

ఈ పథకం క్రింద సామర్లకోట, రాజేంద్రనగరులలో ఉన్న రెండు విస్తరణ శిక్షణ కేంద్రాలలో డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లకు, పంచాయతీలకు సంబంధించిన ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లకు, డివిజనల్ పంచాయతీ ఆఫీసర్లకు పరిపాలనా వ్యవహారాలకు సంబంధించి శిక్షణ యివ్వటానికి ప్రతిపాదించబడింది. ఈ శిక్షణ రెండు నెలలపాటు యివ్వబడుతుంది. తడవకు 40 మంది ఆఫీసర్లకు శిక్షణ యివ్వబడుతుంది. మొత్తం మీద అన్ని వర్గాలకు చెందిన 390 మంది ఆఫీసర్లకు 1959–60 లో శిక్షణ యివ్వటానికి

ప్రతిపాదింపబడింది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 2.90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాకు చెందిన ఆఫీసర్లకు కూడ యీ పథకం క్రింద శిక్షణ యివ్వబడుతుంది.

## పెద్దతరహా, మధ్యతరహా నీటి పారుదల పనులు

పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనుల కోసం 1959—60 లో రు. 1.70 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. వాటి వివరాలు ఈ దిగువ ఇవ్వబడ్డాయి.

| వరుస సంఖ్య. | ప్రాజెక్టు పేరు | 1959—60 లో కేటాయింపు (రూ. లక్షలలో) | పని | నీటిపారుదల జరిగే విస్తీర్ణం (ఎకరాలలో) |
|---|---|---|---|---|
| 1. | స్వర్ణముఖి ఎడమగట్టు కాలువ | 0.50 | పనిప్రారంభించుటకు | — |
| 2. | కల్యాణి రిజర్వాయరు | 0.50 | ,, | — |
| 3. | బాహుద రిజర్వాయరు | 0.50 | ,, | — |
| 4. | కాళింగి రిజర్వాయరు | 0.10 | విస్తరణపనులకు | 1,500 |
| 5. | మల్లిమడుగు ప్రాజెక్టు | 0.10 | పనిముగింపుకు | 3,000 |

## విద్యుచ్ఛక్తి

### *తుంగభద్రజల విద్యుత్ పథకము,*

### *తుంగభద్ర — నెల్లూరు హైడ్రోథర్మల్ పథకము*

9,000 కిలోవాట్ల శక్తిగల 2 జనరేటింగ్ యూనిట్లను అనకట్ట పవరు హౌసువద్ద, 3 యూనిట్లను హంపీ పవరు హౌసు వద్ద — మొత్తం 5 జనరేటింగు యూనిట్లను నెలకొల్పడానికి ప్రతిపాదింపబడగా యిందులో నాలుగు యూనిట్లు మాత్రం - రెండు యూనిట్లు అనకట్ట పవరు హౌసువద్ద, రెండు యూనిట్లు హంపీ పవరు హౌసు వద్ద—1957—58 సంవత్సరాంతానికి నెలకొల్పబడినాయి. విదేశీ మారక ద్రవ్యం లభ్యమైన వెంటనే తుంగభద్ర — నెల్లూరు హైడ్రోథర్మల్ పథకం క్రింద నెలకొల్పబడే 3 యూనిట్లతో పాటు

హంపీ పవరు హౌసువద్ద మూడవ యూనిట్టును కూడా నెలకొల్పటానికి ప్రతిపాదింపబడింది.

అనకట్టవద్ద, హంపీ వద్ద పవరు స్టేషనులను పూర్తిగా అభివృద్ధి పరచే నిమిత్తం 9,000 కిలోవాట్ల శక్తి ఉండే మిగత 3 యూనిట్లలో రెండింటిని అనకట్ట పవరు హౌసువద్ద, ఒక దానిని హంపీ పవరు హౌసువద్ద నెలకొల్ప డానికి ప్రతిపాదింపబడింది. తుంగభద్ర విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రాలలో అప్పుడప్పుడు కలిగే విద్యుదుత్పత్తి లోపాన్ని భర్తీచేసేటందుకుగాను నెల్లూరువద్ద 30 మెగావాట్ల థర్మల్ స్టేషను నొకదాన్ని యీ పథకం క్రింద స్థాపించడానికి ఉద్దేశించబడింది.

పవరు స్టేషను పరికరాలకు కావలసిన విదేశీ మారక ద్రవ్యం ఇంకా లభ్యం కానందువల్ల యీ ప్లాంటును నెలకొల్పటానికి ఉత్తరువులు యింతవరకు యివ్వబడలేదు. రాయలసీమలో మాచ్ ఖండ్ విద్యుచ్ఛక్తిని వినియోగించేటందుకు వీలు కల్పించటంకోసం మాచ్ ఖండ్ తో కలిపే నిమిత్తం 1959–60 లో నెల్లూరు నుండి కడపకు 132 కె. వి. ట్రాన్సు మిషను లైనును వేయడానికి, కడపలో 132 కె. వి. సబ్ స్టేషనుకు సంబం ధించిన పనులను చేకొనడానికిగాను ప్రతిపాదింపబడింది. కేటాయించబడిన రు. 53.42 లక్షల మొత్తంలో (రు. 5.42 లక్షల మొత్తం తుంగభద్ర జల విద్యుచ్ఛక్తి పథకానికి, రు. 48.00 లక్షల మొత్తం తుంగభద్ర– నెల్లూరు హైడ్రోథర్మల్ పథకానికి) రు. 25.44 లక్షల మొత్తం యీ జిల్లా వాటా క్రింద ప్రత్యేకించబడింది.

## గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

ఈ పథకం క్రింద గ్రామీణ ప్రాంతాలకువిద్యుచ్ఛక్తిని సరఫరా చేయ టమేగాక నాగార్జునసాగరు ప్రాజెక్టు పనులకు గరివిడి ఫెర్రో మాంగనీసు ఫ్యాక్టరీ, మొదలైన పెద్ద పారిశ్రామిక కేంద్రాలకు విద్యుచ్ఛక్తి సరఫరాను విస్తరింపచేయటం, రు.10 లక్షలకు మించి ఖర్చయ్యే విస్తరణపథకాలు అమలు పరచటం జరుగుతుంది. ఆంధ్రప్రాంతంలో 100 గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేసే నిమిత్తం 1959–60 సంవత్సరానికి రు. 100 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 10.0 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటా యించబడింది. 10 గ్రామాలు విద్యుతీకరింపబడతాయి.

## పెద్దతరహా, మధ్యతరహా పరిశ్రమలు

### శ్రీ వెంకటేశ్వరా పేపర్ అండ్ స్ట్రాబోర్డు మిల్లు, తిరుపతి

తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వరా పేపర్ అండ్ స్ట్రాబోర్డు మిల్లు మూసి వేయబడగా దానిని ప్రభుత్వం స్వాధీనపరచుకొని ప్రభుత్వ సంస్థగా రెండవ ప్రణాళికా కాలంలో రు. 10.35 లక్షల వ్యయంతో ప్రారంభించటానికి ప్రతిపాదింపబడింది. రోజుకు సుమారు 10 టన్నుల స్ట్రాబోర్డును యీ మిల్లు ఉత్పత్తి చేస్తుంది. పరిపాలనా వ్యవహారాలకు సంబంధించిన యిబ్బందులవల్ల ఈ పథకాన్ని అమలుపరచడంలో తగినంత అభివృద్ధి మొదటి రెండు సంవత్సరాల కాలంలో సాధించబడలేదు. 1958–59 లో అదనంగా భవనాలను కట్టేపనిని పబ్లిక్ వర్క్సుశాఖ ప్రారంభించింది. ఈ మిల్లుకు కావలసిన అదనపు యంత్రాలు, పరికరాల సరఫరా కోసం ఉత్తరువులు త్వరలో యివ్వబడతాయి. 1958–59 సంవత్సరపు బడ్జెటులో కేటాయించబడిన రు. 1.50 లక్షలలో రు. 1.23 లక్షల మొత్తం కొన్ని యంత్రాలను కొనుగోలుకు, భవనాల నిర్మాణానికిగాను ఖర్చుపెట్టబడింది. గత సంవత్సరం నిర్మించటం ప్రారంభించిన భవనాల నిర్మాణాన్ని కొనసాగించటానికి, మిగత యంత్రాలను, పరికరాలను కొనటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 8.12 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరం ఫ్యాక్టరీ ఉత్పత్తి మొదలిడుతుందని ఆశించబడుతున్నది.

## గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు

### *వడ్రంగం పనికి సంబంధించిన సంచారక యూనిట్లు*

గ్రామాల్లోని వడ్రంగం పనివారు తమ ఉత్పత్తి విధానాలను అభివృద్ధి పరచుకొనేటందుకు వీలుకల్పించే నిమిత్తం ఆధునిక యంత్రాలు, మేలురకం పరికరాల ఉపయోగాన్ని సంచారదళంద్వారా ప్రదర్శన పూర్వకంగా తెలియచేయటమే ఈ పథకం యొక్క లక్ష్యం. ప్రతిచోటా ఈ పరికరాల ఉపయోగాన్ని గురించి 20 నుండి 30 రోజులవరకు ప్రదర్శనపూర్వకంగా వివరించటం జరుగుతుంది. ఉత్సాహంచూపే పనివారు ఈ యంత్రాలను ఉపయోగించి చూడటానికి అనుమతించబడతారు. ఈ వ్యాను ప్రస్తుతం

చిత్తూరు జిల్లాలో పనిచేస్తున్నది. ఈ సంవత్సరంలో కూడ ఈ సంచారదళం రు. 0.13 లక్ష వ్యయంతో కొనసాగించబడుతుంది. చిత్తూరు జిల్లా అంతటా ఈ యూనిట్టు పర్యటించి ప్రదర్శనపూర్వకంగా వివరించటం ఈ సంవత్సరాంతానికి పూర్తి అవుతుంది.

### *తడుకుపేటలో తాళముల తయారి*

ఈ పథకం క్రింద చిత్తూరు జిల్లాలోని తడుకుపేటలో తాళముల తయారీకి సంబంధించిన యూనిట్టు నొకదాన్ని ఆధునిక పద్ధతుల్లో స్థాపించటానికి ప్రతిపాదింపబడింది. భవనాల నిర్మాణం, యంత్రాల కొనుగోలువంటి ప్రాథమిక చర్యలు తీసికోవడం ఈ సంవత్సరం పూర్తవుతుంది. ఇందుకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.30 లక్షల మొత్తం కేటాయించబడింది.

### *పరిశ్రమలకు రాజ్యప్రభుత్వ సహాయ చట్టం క్రింద ఋణాలు*

ఈ పథకం క్రింద పరిశ్రమలకు రాజ్య ప్రభుత్వ సహాయం చట్టం క్రింద ఋణాలుగా రు. 13.11 లక్షల మొత్తం ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో యివ్వబడింది. ఈ సంవత్సరంలో యింకా రు. 7 లక్షలు పారిశ్రామికులకు ఋణాలుగా యివ్వబడుతుంది. ఈ జిల్లాలోని పారిశ్రామికులు కూడ ఈ పథకం వల్ల ప్రయోజనం పొందుతారు.

### *పరిశ్రమలశాఖ డైరెక్టరేటును, జిల్లాల సిబ్బందిని పటిష్ఠం చేయటం*

రెండవ ప్రణాళికా కాలంలో ఎక్కువయిపోయిన పనిని నిర్వహించేటందుకు గాను రెండవ ప్రణాళికలో కేటాయించబడిన రు. 7.95 లక్షల వ్యయంతో రాజ్యస్థాయిలోను, జిల్లా స్థాయిలోను పరిశ్రమల శాఖను పటిష్ఠం చేయడానికి ప్రతిపాదింపబడింది. మొదటి 3 సంవత్సరాలలోను అదనపు సిబ్బంది — సాంకేతిక మరియు మినిస్టీరియల్ సిబ్బంది — రు. 3.45 లక్షల వ్యయంతో నియమించబడింది. ఇంతకు ముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి, యింకా కొంత అదనపు సిబ్బందిని నియమించటానికి గాను ఆంధ్ర ప్రణాళికలో రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది.

## *బ్లాకు ప్రాంతాల్లో నియమించబడిన (పరిశ్రమల) విస్తరణాధికార్ల జీతాలు*

బ్లాకు ప్రాంతాలలో నియమించబడిన (పరిశ్రమల) విస్తరణాధికార్ల జీతాలక్రింద రెండవ ప్రణాళికలో రు. 10.17 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందుకు గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది.

## *పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్లకు జీపుల సరఫరా*

ప్రతిపాదింపబడిన పథకాలు త్వరితంగాను, సమర్థవంతంగాను అమలు పరచబడాలంటే అందుకు సంబంధించిన పరిశ్రమల శాఖాధికార్లు తరచు పర్యవేక్షణ జరుపుతూ సాంకేతిక సహాయం అందచేస్తుండాలి. ఈ అధికార్లు త్వరత్వరగా పర్యటనలు జరిపేటందుకు వీలుగా వీరికి జీపులను సరఫరా చేయటం అవసరం. 1958–59 లో ఆంధ్రలోని పరిశ్రమల, వాణిజ్య శాఖ అసిస్టెంటు డైరెక్టర్లు అందరికీ జీపులు యివ్వబడినాయి. ఈ జీపుల నిర్వహణ కోసం ఈ సంవత్సరానికి రు. 0.30 లక్ష కేటాయించబడింది. ఇందులో ఒక జీపు యీ జిల్లాలో ఉంది.

## హస్తకళలు

## *తిరుపతి దగ్గరనున్న తిరుచానూరులో కొయ్యబొమ్మలకు సంబంధించిన ఉత్పత్తి – శిక్షణ కేంద్రం*

మేలురకం పద్ధతుల్లో కొయ్యబొమ్మలను తయారు చేయటం గురించి తడవకు 6 మంది పనివారికి చొప్పున శిక్షణ యివ్వటం కోసం 1956 లో కొయ్యబొమ్మల తయారీకి సంబంధించిన ఉత్పత్తి - శిక్షణ కేంద్రం ఒకటి తిరుచానూరులో ప్రారంభించబడింది. మొదటి మూడు సంవత్సరాల్లోను సంవత్సరానికి 6 మంది చొప్పున 18 మందికి శిక్షణ యివ్వబడింది. ఈ సంవత్సరం సహకార పద్ధతుల్లో యీ కేంద్రాన్ని కొనసాగించటం, 6 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వటం జరుగుతుంది. ఇందు కయ్యే ఖర్చుకుగాను ప్రణాళికలో రు. 0.17 లక్ష కేటాయించబడింది.

## *గ్రామీణ, కుటీర పరిశ్రమల వస్తువుల అమ్మకానికిగాను తిరుపతిలో విక్రయశాల స్థాపన*

కుటీర పరిశ్రమలను అభివృద్ధిపరచటానికి, ఆ పరిశ్రమల్లో తయారయ్యే వస్తువులకు జనాదరణ కలుగచేయటానికిగాను 1957–58 లో తిరుపతిలో ఒక విక్రయశాల ప్రారంభించబడింది. కుటీర, గ్రామీణ పరిశ్రమల్లో

తయారయ్యే వస్తువులకు, యితర హస్తకళల వస్తువులకు ఈ విక్రయశాల అమ్మకం సౌకర్యాన్ని కలిగించటమేగాక ఉత్పత్తిని పెంచటానికి తోడ్పడు తుంది. ఈ సంవత్సరం ఈ విక్రయశాలను కొనసాగించటం కోసం ప్రణాళికలో రు. 0.19 లక్ష కేటాయించబడింది.

## కుప్పంలో సన్నపరువుల తయారీ పరిశ్రమాభివృద్ధి

కుప్పంలో సన్న పరువుల పరిశ్రమాభివృద్ధికోసం 1958-59 లో రు. 0.06 లక్ష వ్యయంతో ఒక తయారి కేంద్రం ప్రారంభించబడింది. ఈ పథకం కొనసాగింపుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.03 లక్ష కేటాయించబడింది. ఈ సంవత్సరం ఈ కేంద్రం సహకార పద్ధతుల్లో నిర్వహించబడుతుంది.

## క్రొత్త పథకాలు

హస్తకళలకు సంబంధించిన క్రింది పథకాలు రాజ్యస్థాయిలో యీ సంవత్సరంలో అమలుపరచబడతాయి. ఆంధ్రప్రాంతంలోని అన్ని జిల్లాలకు కూడా ఈ పథకాల క్రింద లాభం చేకూరుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959–60 లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | హస్తకళలకు ఉపయోగించేటందుకు దేవాలయాలలోని డిజైనులను కాపీచేయడానికి | 0.05 |
| 2. | అక్కడక్కడా ఉండి ఒక సహకార సంఘం క్రిందకు తీసుకరావడానికి వీలుగా ఉండనట్టి పనివారలకు వ్యక్తిగతంగా ఋణాలు, గ్రాంట్లు మంజూరు చేయడానికి | 0.05 |

## తిరుపతి రైల్వేస్టేషనులో చేతిపనుల ప్రదర్శనకు షోకేసులను ఏర్పాటుచేయటం

తిరుపతి రైల్వేస్టేషనులో చేతిపనుల ప్రదర్శనకు షోకేసులను ఏర్పాటు చేయటంకోసం 1959–60 ప్రణాళికలో రు. 0.01 లక్ష కేటాయించబడింది.

## పట్టుపరిశ్రమ

### పలమనేరులో ప్రస్తుతమున్న ప్రభుత్వ పట్టుపరిశ్రమ క్షేత్రంలో సౌకర్యాలు సమకూర్చటం

పలమనేరులోని ప్రభుత్వ పట్టుపరిశ్రమ క్షేత్రంలో అదనపు సౌకర్యాలను ఏర్పాటు చేయటంకోసం ఈ పథకం తలపెట్టబడింది. ఒక రేరింగు హౌసును నిర్మించటం, ఒక బావిని త్రవ్వటం, రెండు ఎకరాలలో మల్బరీ తోటను వేయడం జరుగుతుంది. మిశ్రమజాతి పట్టుపురుగుల పెంపకానికిగాను విదేశీజాతుల పురుగుల పెంపకం విస్తృతం చేయబడుతుంది. 1958–59 లో మల్బరీతోట వేయబడింది. 1958–59 లో రేరింగు హౌసు నిర్మాణం పూర్తయింది. బావిత్రవ్వటం కూడ 1958–59 లో ప్రారంభించబడింది. త్రవ్వటం పూర్తికావొచ్చింది. 1958–59 లో 33,050 విదేశీరకపు పట్టుకాయలు ఈ క్షేత్రంలో ఉత్పత్తి చేయబడినాయి. ఈ పథకాన్ని కొనసాగించటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది. 1959–60 లో 2 లక్షల విదేశీరకం పట్టుకాయలు ఉత్పత్తి చేయటానికి ప్రతిపాదింపబడింది.

### హిందూపురంలోను, పలమనేరులోను రీలింగు యూనిట్లను స్థాపించటం

ఈ పథకం క్రింద అనంతపురం, చిత్తూరు జిల్లాలోని పట్టు పరిశ్రమదారులకు మార్కెటింగు సౌకర్యాలు కలిగించటానికి ఉద్దేశింపబడింది. ఇందుకుగాను 1957–58 లో హిందుపురంలో ఒకటి, 1958–59 లో పలమనేరులో ఒకటి — మొత్తం రెండు రీలింగు యూనిట్లు స్థాపించబడినాయి.

పట్టుపరిశ్రమదారులచే ఉత్పత్తి చేయబడిన పట్టుకాయలను అక్కడికక్కడే డబ్బు చెల్లించి కొనడానికి, పట్టుపరిశ్రమశాఖ తరఫున పట్టును ఆ కాయల నుండి తీయటానికి యీ యూనిట్లు పనిచేస్తాయి. 1957–58, 1958–59 సంవత్సరాలలో యీ రెండు యూనిట్లలోను, 172 పౌన్ల ముడి పట్టు తీయబడింది ఈ సంవత్సరంలో రు. 0.20 లక్ష (ప్రతియూనిట్టుకు రు. 0.10 లక్ష చొప్పున) ప్రణాళికలో కేటాయించబడింది. ఈ యూనిట్లను కొనసాగించడానికి 10,000 పౌన్ల పట్టుకాయలను అనంతపురం, చిత్తూరు జిల్లాలలో ఉత్పత్తి దారులనుండి కొనటానికి పై డబ్బు వినియోగించ బడుతుంది.

## రెండు పాఠశాలలలో పట్టు పరిశ్రమను వృత్తి విద్యగా ప్రవేశపెట్టటం

హిందూపురం దగ్గర ఉన్న సేవామందిరంలో ఉన్న బేసిక్ పాఠశాలలోను, చిత్తూరు జిల్లా చింతపర్తిలోని ప్రాథమికోన్నత పాఠశాలలోను 1957–58 సంవత్సరంలో పట్టుపరిశ్రమ బేసిక్ వృత్తివిద్యగా ప్రవేశ పెట్టబడింది. ప్రత్యక్ష విధానాలద్వారా పిల్లలకు మల్బరీ వ్యవసాయాన్ని గురించి, పట్టు పురుగుల పెంపకం గురించి యిక్కడ శిక్షణ యివ్వబడు తుంది. ఈ రెండు పాఠశాలల్లోను యీ వృత్తి విద్యను యీ సంవత్సరంలో కొనసాగించేటందుకు ప్రణాళికలో రు. 0.02 లక్ష (ఒక్కొక్క పాఠశాలకు రు. 0.01 లక్ష చొప్పున) కేటాయించబడింది.

## మల్బరీ తోటలను విస్తరింపచేసేటందుకు, పట్టుకాయల ఉత్పత్తికి సంబంధించిన ప్రచార కేంద్రం స్థాపన

చిత్తూరు జిల్లాలోని పట్టుపరిశ్రమదార్లకు సాంకేతిక సహాయం అంద చేయటంకోసం 1958–59 లో ఈ పథకం అమలుపరచబడింది. అదనంగా 20 ఎకరాల భూమి మల్బరీతోటల క్రిందకు తీసుకరావటమేగాక 3,180 పౌన్ల పట్టుకాయలు ఉత్పత్తి చేయబడినాయి. ఈ సంవత్సరం కూడ రు. 0.02 లక్ష ఖర్చుతో ఈ పథకం కొనసాగించబడుతుంది. మల్బరీతోటలు దాదాపు 100 ఎకరాలమేర వేయబడతాయి.

## పుంగనూరులో చాకీపెంపకం యూనిట్టు స్థాపన

చిత్తూరు జిల్లాలోని పుంగనూరులో చాకీపెంపకం యూనిట్టొకటి 1958-59 లో స్థాపించబడింది. రెండవదశవరకు పెంచిన తరువాత 5,000 పట్టుకాయలు పట్టుపరిశ్రమదార్లకు సరఫరా చేయబడినాయి. ఈ సంవత్సరంలో ఈ యూనిట్టు కొనసాగించబడుతుంది. ఇంకా 10,000 పట్టుకాయలు పెంచబడి పంపకం చేయబడతాయి. ఇందుకు ప్రణాళికలో రు. 0.05 లక్ష కేటాయించబడింది.

## క్రొత్త పథకాలు

### పట్టుపరిశ్రమ ప్రాంతాల్లో ప్రచారం

పట్టు పరిశ్రమలో ప్రజలకు శ్రద్ధాసక్తులు చూపేటట్టు చేయటానికి పట్టుపరిశ్రమ ప్రాంతాల్లో ప్రచారం చేయటంకోసం ఈ పథకాన్ని అమలు పరచేటందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.01 లక్ష కేటాయించ బడింది.

### పలమనేరులో మల్బరీ నారుమడి స్థాపన

పలమనేరులో మల్బరీ నారుమడి ఒకటి మొక్కల సరఫరానిమిత్తం స్థాపించటానికిగాను 1959-60 ప్రణాళికలో రు. 0.10 లక్ష కేటాయించ బడింది.

## గ్రామీణ పరిశ్రమలు

### బెల్లం, ఖండసారి పథకాలు

ఈ పథకం క్రింద, రైతులు మేలురకం పనిముట్లను కొనుక్కోవ టానికి గాను వడ్డీలేకుండా ఋణాలు యివ్వబడతాయి. ఈ ఋణాలు 5 సంవత్సరాలకాలంలో వసూలు చేయబడతాయి. ఇంతే కాక మేలురకం బెల్లం, ఖండసారీలను తయారు చేయటం గురించి ప్రదర్శనపూర్వకంగా వివరించబడుతుంది. అనకాపల్లి, చోడవరం, రామచంద్రపురం, చిత్తూరు, హిందూపురం తాలూకాలలో యీ పథకం మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో (1955) అమలు పరచబడింది. ఇందుకుగాను ప్రత్యేక ఫీల్డు

సిబ్బంది నియమించబడింది. మేలురకం బెల్లం, ఖాండసారి తయారు చేయటంలో వీరు శిక్షణ పొందారు. 1956–57, 1957–58 సంవత్సరాలలో యీ పథకం కొనసాగించబడింది. అయితే 1958–59 లో యిది అమలు పరచబడలేదు. ఈ సంవత్సరంలో యీ పథకాన్ని శ్రీకాకుళం జిల్లాలోని పాలకొండ తాలూకాకు, పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూకాకు, కృష్ణా జిల్లా దివి తాలూకాకు, గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాకు, చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాకు విస్తరింపచేయడానికి, ఇంతే కాక ప్రస్తుతము యీ పథకం అమలులో ఉన్న ప్రాంతాలలో కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఈ పథకం క్రింది కార్యక్రమాలను క్రొత్త ప్రాంతాలకు విస్తరింప చేయటం ద్వారా యిప్పుడున్న 30,000 ఎకరాలే కాక అదనంగా 32,650 ఎకరాల మేర యీ పథకం క్రిందకు తీసుకురాబడుతుంది. ప్రస్తుతం యీ పథకం పరిశ్రమల శాఖవారి నియంత్రణలో అమలు పరచబడుతున్నది. ఇపుడు దీన్ని ఆంధ్ర ప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు క్రిందకు మార్చటానికి ప్రతిపాదింపబడింది. ఈ బోర్డు 1958 నవంబరులో ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరానికి యీ పథకం కోసం రు. 6.00 లక్షలు కేటాయించబడినాయి.

## *1948 సంవత్సరపు కుటీర పరిశ్రమలకు ఋణాలు, సబ్సిడీల నివ్వటానికి సంబంధించిన నిబంధనల క్రింద ఋణాలు*

వడ్రంగం, నేతపని, కమ్మరం మొదలయిన వివిధ కుటీర, గ్రామీణ పరిశ్రమలలో పనిచేస్తున్న పనివారికి సహాయం చేసే ఉద్దేశంతో రెండవ ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాల కాలంలో రు. 1.64 లక్షల మొత్తం ఋణాలుగా పంపకం చేయబడింది. 1958–59 లో యీ పథకం అమలుపరచ బడలేదు. ఈ సంవత్సరంలో రు. 2.00 లక్షల వరకు ఋణాలు మంజూరు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని పనివారికి కూడ యీ పథకం వల్ల లాభం చేకూరుతుంది.

## *పారిశ్రామిక సహకార సంఘాలు*

గ్రామీణ పరిశ్రమలకు సుస్థిరత్వంచే కూర్చడం, వాటి ఉత్పత్తి విధానాల్ని మెరగు పరచటం ద్వారా అవి అధికోత్పత్తిని సాధించేటట్లు చేయడమే ఈ పథకం యొక్క ఉద్దేశం. ఇందుకుగాను సహకార సంఘాల ద్వారా

దంపుడు బియ్యం పరిశ్రమను అభివృద్ధి పరచేటందుకు 10 కేంద్రాలను ప్రారంభించటం, కలంకారీ అద్దకం పరిశ్రమకు నిర్వహణ మూలధనం, యితర ఖర్చుల క్రింద గ్రాంటులు యివ్వటం, మేలురకం పరికరాలు కొనుక్కోవటానికి గాను గుంటూరు కమ్మరం సహకార సంఘం వారికి ఆర్థిక సహాయం చేయటం, పరికరాలు మొదలయినవి కొనుక్కోవటానికి గాను కుటీర పరిశ్రమల సహకార సంఘాలకు సబ్సిడీలు యివ్వటంవంటి పథకాలు రూపొందించబడినాయి. ఇందుకుగాను యీ పథకం క్రింద యింత వరకు రు. 2.72 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. ఈ పథకం కొనసాగింపుకోసం ఈ సంవత్సరానికి రు. 1.58 లక్షల మొత్తం కేటాయించబడింది. క్రొత్తగా ఏర్పాటు చేయబడిన ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు అధ్వర్యం క్రిందకు ఈ పథకాన్ని మార్చడానికి కూడ ప్రతిపాదింపబడింది.

## చేనేత పరిశ్రమ

### *సహకార సంఘాలకు వాటా మూలధనం,*

### *నిర్వహణ మూలధనం క్రింద ఋణాలు*

చేనేత సహకార సంఘాలలో వాటాలు తీసికొని అందులో సభ్యులుగా అయ్యేటందుకు వీలుకల్పించే నిమిత్తం చేనేత పనివారికి ఋణాలను యివ్వటానికి ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. ఈ సంవత్సరపు ఆంధ్ర ప్రణాళికలో యీ పథకమునకుగాను రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 వాటా మూలధనం క్రింద ఋణాలు యివ్వటం కోసం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 300 క్రొత్త మగ్గాలు సహకార సంఘాల క్రిందకు తీసుకరాబడుతాయని, 40 లక్షల గజాల గుడ్డ ఉత్పత్తి చేయబడుతుందని ఆశించబడుతున్నది.

### *ఆంధ్ర చేనేత సహకార సంఘం యొక్క మార్కెటింగు వ్యవస్థవిస్తరణ*

ఇంకా ఎక్కువగా విక్రయశాలలను ప్రారంభించటం ద్వారాను, చేనేత గుడ్డలను గురించి తీవ్రప్రచారం చేయటం ద్వారాను ఆంధ్ర చేనేత సహకార సంఘం వారి మార్కెటింగు వ్యవస్థను పటిష్ఠం చేయుటానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకమునకు గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.31 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.30 లక్ష

యీ జిల్లాలో మూడు విక్రయశాలలు ప్రారంభించటానికి గాను వినియో గించబడుతుంది. ఈ సంవత్సరంలో విక్రయశాలల ద్వారా 5 లక్షల గజాల గుడ్డ అమ్మబడుతుందని ఆశించబడుతున్నది.

## ఉత్పత్తి విధానాల అభివృద్ధి, వ్యవస్థ వ్యయాలు

మంచిరకం చేనేత గుడ్డలను ప్రజారంజకంగా ఉండే నమూనాలలో ఉత్పత్తి చేయుటకుగాను చేనేత పరిశ్రమ యొక్క సాంకేతిక నైపుణ్యాన్ని అభివృద్ధి పరచటానికి ప్రతిపాదింపబడింది. ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో ఈ పథకం అమలుపరచబడింది. స్టాండర్డు రీడ్లు, వార్పింగుయంత్రాలు మొదలయిన మేలురకం పరికరాలు చేనేత పనివారికి సరఫరా చేయబడినాయి. యీ సంవత్సరంలో ఆంధ్రకుగాను ప్రణాళికలో రు. 4.80 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.31 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది. చేనేత పనివారికి 50 స్టాండర్డు రీడ్లను, నాలుగు వార్పింగు యంత్రాలను, 40 స్లేలను, ఒక ప్రెస్ మిషన్‌ను సరఫరా చేయటానికి, గుడ్డల నాణ్యతను సరిచూడడానికి నియమిం చబడిన ఇద్దరు టెక్నికల్ అసిస్టెంట్లను కొనసాగించటానికి యీ డబ్బు వినియోగించబడుతుంది.

## ముదరా

చేనేత గుడ్డ అమ్మకాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా చేనేత గుడ్డ ఉత్పత్తిని ఎక్కువ చేసేటందుకుగాను ఆంధ్ర చేనేత సహకార సంఘం యొక్క విక్రయశాలల ద్వారాను, ప్రాథమిక చేనేత సహకార సంఘాల ద్వారాను జరిగే చేనేత గుడ్డ అమ్మకం పై ముదరా రూపాయకు 6 నయా పైసలు చొప్పున యివ్వబడుతున్నది. సరుకు మిగిలి పోయిఉన్న సందర్భాల్లో సంఘాలు తమ దగ్గర నిలువ ఉండిపోయిన సరుకును అమ్మేటందుకు గాను అప్పుడప్పుడు ప్రత్యేక ముదరాకూడ యివ్వడం జరుగుతుంది. ఈ పథకం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 35.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.50 లక్ష యీ జిల్లాలో ముదరా యిచ్చుటకుగాను వినియోగించబడుతుంది.

# రోడ్లు

## ప్రభుత్వ రోడ్లు (బకాయి పనులు)

ఆంధ్రప్రాంతంలో బకాయి రోడ్డు పనులను కొనసాగించటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 2.93 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.059 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. పి. ఎన్. రోడ్డు మైలు 36/8 నుండి ఆర్కోణం—రేణిగుంట రోడ్డు మైలు 41/4 వరకు రోడ్డు నిర్మించటానికి ఈ డబ్బు వినియోగించబడుతుంది.

## ప్రభుత్వ రోడ్లు (క్రొత్త పనులు)

ఆంధ్ర ప్రాంతంలో ఈ పథకం కోసం 1959—60 సంవత్సరానికి రు. 41.69 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 2.01 లక్షల మొత్తం, ఈ జిల్లాలోని క్రింది పథకాల కోసం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పని వివరం | 1959—60 లో కేటాయింపు (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | పీలేరు—భాకరుపేట రోడ్డు మై. 18-21 మధ్య ఘాటు ప్రాంతానికి అభివృద్ధి పనులు. | 0.050 |
| 2. | కాళహస్తి—మిత్తికండిగ రోడ్డు మై. 21/4 నుండి పుత్తూరు-నాగలాపురం రోడ్డు మీద ఉన్న కొప్పేడుకు రోడ్డు నిర్మించటం. | 0.400 |
| 3. | పైరోడ్డులో "క్రాస్‌డ్రయినేజీ" పనులకు. | 0.100 |
| 4. | పుతలపేట—నాయుడుపేట రోడ్డు మై. 40/6 వద్ద "లో లెవల్" వంతెన నిర్మించటం. | 0.260 |
| 5. | చిత్తూరు — గుడియాట్టం రోడ్డులో మైళ్ళు 0/0—17/1 మధ్య తగు ప్రదేశాల్లో తారువేయటం. | 0.100 |

| | | |
|---|---|---|
| 6. | గుడియాట్టం – పలమనేరు రోడ్డులో మైళ్ళు 14/5–27/1 మధ్య తగు "రీచి"లలో తారువేయటం (5 మైళ్ళు) | 0.100 |
| 7. | చిత్తూరు – పుత్తూరు రోడ్డులో ఘాటు ప్రాంతానికి అభివృద్ధిపనులు. | 0.100 |
| 8. | పుంగనూరు – పులిచెర్ల రోడ్డు మై. 0/1 వద్ద వంతెన నిర్మాణం. | 0.100 |
| 9. | పలమనేరు – కుప్పంరోడ్డులో వంతెనలకు, కల్వర్టులకు అభివృద్ధి పనులు. | 0.100 |
| 10. | చిత్తూరు – కర్నూలురోడ్డులో మై. 46/0 నుండి 54/0 వరకు తారువేయటం. | 0.300 |
| 11. | ఆర్కోణం – రేణిగుంట రోడ్డులో మైళ్ళు 19/0-27/0 మధ్య యిదివరకే తారువేసిన భాగాల్ని మినహాయించి యితర భాగాలకు తారువేయటం. | 0.200 |
| 12. | పుత్తూరు – నాగలాపురం రోడ్డులో మైళ్ళు 0/0-13/4 మధ్య తగు "రీచి"లలో తారువేయటం. | 0.200 |

## ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న రోడ్లస్థాయిని పెంచడం

ఆంధ్రప్రాంతంలో ప్రభుత్వం వారిచే యింతకుముందు స్వాధీనం చేసికొనబడిన జిల్లాబోర్డు రోడ్లస్థాయిని పెంచటంకోసం 1959–60 ప్రణాళికలో రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.15 లక్షల మొత్తం ఈ జిల్లాలో క్రింది రోడ్లస్థాయిని పెంచటంకోసం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959–60 లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | నగరి – పల్లిపేటరోడ్డు మై. 0/0 నుండి 7/0 వరకు | |
| | (ఎ) "డిప్పు"లకు "కల్వర్టు"లకు అభివృద్ధి పనులు | 0.20 |
| | (బి) "కాజ్ వే"లను పటిష్ఠంచేయటం | 0.20 |

2. కాళహస్తి – మిత్తికండిగై రోడ్డు

| | |
|---|---|
| (ఎ) "కాజ్ వే"లను పటిష్ఠంచేయటం | 0.20 |
| (బి) "డిప్పలకు" అభివృద్ధి పనులు | 0.10 |
| 3. కుప్పం – కృష్ణగిరి రోడ్డుమీద బండ్లబాటకు పటిష్ఠం చేయటం | 0.20 |
| 4. కుప్పం – కృష్ణగిరి రోడ్డుమీద చిన్న చిన్న గండ్లకు మరమ్మతులు చేయటం | 0.25 |

## రోడ్లు ప్రక్కన చెట్లు

రోడ్డకిరువైపులా చెట్లను నాటటం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో యీ జిల్లాకు రు. 0.04 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ఇతర రోడ్లు (బకాయి పనులు)

ఈ పథకం క్రింద 1959–60 ప్రణాళికలో రు. 15.00 లక్షల మొత్తం కేటాయించబడింది. మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రారంభించబడి ముగింప బడకుండా ఉన్నటువంటి పి. డబ్ల్యు. ఆర్. డి రోడ్డు పనులను పూర్తి చేసేనిమిత్తం ఆంధ్రప్రాంతంలోని జిల్లాబోర్డులకు పూర్తిగ్రాంట్లు యివ్వటంకోసం పై డబ్బు వినియోగింపబడుతుంది. ఇందులో రు. 0.40 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ఇతర రోడ్లు (క్రొత్త పనులు)

పి. డబ్ల్యు. ఆర్. డి రోడ్డు పనులుచేకొనే నిమిత్తం యీ పథకం క్రింద ఆంధ్రప్రాంతంలోని జిల్లా బోర్డులకు సగం గ్రాంట్లు యివ్వబడతాయి. జిల్లా బోర్డులు, యీ రోడ్లవల్ల ప్రయోజనం పొందేవారు మిగత సగం ఖర్చును భరించాలి. క్రొత్త పనుల నిర్వహణ నిమిత్తం ఆంధ్రలోని జిల్లా బోర్డులకు గ్రాంట్లు యివ్వటం కోసం 1959–60 లో రు. 6.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## గ్రామ ప్రణాళికలలో రోడ్లు

ఈ పథకం క్రింద కల్వర్టులు, వంతెనలు, గ్రామాలకు క్రొత్త రోడ్లు గ్రామాలకు గ్రామాలకు మధ్య రోడ్లు నిర్మించటం జరుగుతుంది. జిల్లా కలెక్టర్లు యీ పథకం క్రింద చేయవలసిన పనులను నిర్ణంయించి నిర్వహిస్తారు. ఖర్చులో సగం ప్రభుత్వంవారు భరిస్తారు. మిగత సగం యీ రోడ్ల వల్ల ప్రయోజనం పొందే ప్రజలు భరించాలి. ఆంధ్రలో యీ పథకం క్రింద 1959—60 లో రు. 15.00 లక్షల మొత్తం ఖర్చు పెట్టటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 1.785 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## పర్యాటనత్వాభివృద్ధి

ఆంధ్రలో పర్యటనత్వాభివృద్ధికిగాను 1959—60 ప్రణాళికలో రు. 1.09 లక్షల మొత్తం కేటాయించబడింది. వసతి సౌకర్యాలు, వినోద సౌకర్యాలు ముఖ్యంగా యీ పథకం క్రింద సమకూర్చబడతాయి. పై మొత్తంలో రు. 0.41 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది. ఈ జిల్లాలోని తిరుపతిలో ఎక్కువ ఆదాయం వచ్చేవర్గానికి చెందిన వారికోసం ఒక విశ్రాంతి గృహాన్ని నిర్మించటం కోసం పై డబ్బు వినియోగించబడుతుంది.

# విద్య

## ప్రాథమిక విద్య

ఈ జిల్లాలో ప్రాథమిక విద్యాభివృద్ధికోసం రు. 8.619 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రింది విధంగా వినియోగించబడుతుంది.

### కొనసాగుతున్న పథకాలు

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (లక్షలు రూపాయలలో) |
|---|---|---|
| 1. | 1956—57 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు. స్థానిక సంస్థలు (5 పాఠశాలలు.) | 0.050 |

| | |
|---|---|
| 2. 1957–58 లో తెరవబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు. | |
| (ఎ) స్థానిక సంస్థలు (22 పాఠశాలలు) | 0.120 |
| (బి) ఎయిడెడ్ వి (9 పాఠశాలలు) | 0.090 |
| 3. 1958–59 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు. | |
| (ఎ) స్థానిక సంస్థలు (4 పాఠశాలలు) | 0.020 |
| (బి) ఎయిడెడ్ (4 పాఠశాలలు) | 0.020 |
| 4. 1957–58 లో ప్రాంరంభించబడిన జూనియరు బేసిక్ పాఠశాలలు. | |
| (ఎ) స్థానిక సంస్థలు (14 పాఠశాలలు) | 0.270 |
| 5. 1958–59 లో ప్రాంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు. | |
| (ఎ) స్థానిక సంస్థలు (5 పాఠశాలలు) | 0.020 |
| (బి) ఎయిడెడ్ (5 పాఠశాలలు) | 0.020 |
| 6. 1957–58 లో జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చ బడిన ప్రాథమిక పాఠశాలలు | |
| (ఎ) ప్రభుత్వం వారివి (సాంఘిక సంక్షేమశాఖ)<br>(బి) స్థానిక సంస్థలవి (22 పాఠశాలలు)<br>(సి) ఎయిడెడ్ (25 పాఠశాలలు) | 0.006 |
| 7. 1958–59 లో జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు | |
| (ఏ) స్థానిక సంస్థలు (25 పాఠశాలలు)<br>(బి) ఎయిడెడ్ (5 పాఠశాలలు) | 0.003 |
| 8. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలలో పనిచేసే ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపుకు | 3.170 |

| | | |
|---|---|---|
| 9. | 1958–59 లో జిల్లా బోర్డువారిచే స్వాధీనం చేసుకోబడిన ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలలకు | 0.600 |
| 10. | 1956–57 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు తరగతులకు | |
| | (ఏ) స్థానిక సంస్థలు (16 సెక్షన్లు మరియు 4 సెక్షన్లు) | 0.080 |
| | (బి) ఎయిడెడ్ (7 సెక్షన్లు) | 0.020 |
| 11. | 1957-58 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు తరగతులకు | |
| | (ఏ) ప్రభుత్వం వారివి (2 పాఠశాలలు 8 సెక్షనులు) | 0.120 |
| | (బి) ఎయిడెడ్ (1 పాఠశాల 2 సెక్షనులు) | 0.030 |
| 12. | 1957–58 లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలు ఎయిడెడ్ (2 పాఠశాలలు) | 0.060 |
| 13. | 1958–59 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షనులు (ప్రభుత్వానివి) (1 సెక్షను) | 0.050 |
| 14. | కార్వేటినగరులోని ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలకు భూమికి భవనాలకు కలుపుకొని | 0.700 |
| 15. | 1958–59 లో బేసిక్ విధానానికి మార్చబడిన ఒక శిక్షణ పాఠశాలకు | 0.020 |
| 16. | 1956-57 లో సెకండరీ గ్రేడు శిక్షణ విభాగాలుగా మార్చబడిన హైయ్యర్ ఎలిమెంటరీ గ్రేడు శిక్షణ విభాగాలకు | 0.010 |
| 17. | 1958–59 లో కొన్ని ప్రభుత్వ శిక్షణ పాఠశాలలో నియమించబడిన డ్రాయింగు, హిందీ టీచర్లకు (ఒకటీచరు) | 0.010 |

| | | |
|---|---|---|
| 18. | 1957–58 లో ఇన్స్పెక్టరేటులలో నియమించ బడిన గుమాస్తాలకు, టైపిస్టులకు (ఇద్దరికి) | 0.010 |
| 19. | 1958–59 లో నియమించబడిన సీనియరు డిప్యూటి ఇన్స్పెక్టర్లకు, జవానులను కలు కొని (10 పదవులు) | 0.180 |
| 20. | సబార్డినేట్ ఆఫీసర్ల కార్యాలయాల భవనాలకు అద్దె. | 0.020 |
| 21. | మూడవ ఫారం వరకు ఉచిత విద్యను గరపడానికి సంబంధించిన పథకాన్ని అమలు పరచడానికి ఇన్స్పెక్టరేట్లలో నియమించబడిన అప్పరు డివిజను గుమాస్తాలకు (ఒక గుమాస్తా) | 0.010 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 22. | విద్యావంతులలో నిరుద్యోగులకు ఉద్యోగం కల్పించ డానికి సంబంధించిన పథకం | 1.090 |
| 23. | ప్రాథమిక పాఠశాలల్లో అదనపు ఉపాధ్యాయులను నియమించుటకు (27 మంది ఉపాధ్యాయులు) | 0.180 |
| 24. | ప్రాథమిక పాఠశాలలను జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చుటకు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (20 పాఠశాలలు) | 0.060 |
| | (బి) ఎయిడెడ్ (7 పాఠశాలలు) | 0.020 |
| 25. | స్త్రీ విద్యకు సంబంధించి కేంద్ర పథకం కొరకు | |
| | (ఎ) ఒక హైయర్ గ్రేడు శిక్షణ పాఠశాల | 7.009 |
| | (బి) ఒక ఎలిమెంటరీ గ్రేడు శిక్షణ పాఠశాల | 0.180 |
| 26. | 1958–59 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠ శాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంటులు | |
| | (ఎ) ఎయిడెడ్ (4 పాఠశాలలు) | 0.010 |
| | (బి) స్థానిక సంస్థలు (14 పాఠశాలలు) | 0.370 |

| | | |
|---|---|---|
| 27. | ఎయిడెడ్ మాధ్యమిక పాఠశాలల్లో అదనపు తరగతులకు ప్రారంభించడం. (5 పాఠశాలలు) కాంపెన్సేటరీ గ్రాంట్లు | 0.050 |
| 28. | బాలికలకోసం ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలను ప్రారంభించటం పుత్తూరు చంద్రగిరిలలో రెండు పాఠశాలలు | 0.260 |
| 29. | 1958–59 లో ప్రారంభించబడిన ప్రాచ్యవిద్యా మాధ్యమిక పాఠశాలలకు; అదనపు సెక్షనులకు గ్రాంట్లు. ఎయిడెడ్ (ఒక పాఠశాల) | 0.010 |
| 30. | ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభించటం (ఒక సెక్షను) | 0.020 |
| 31. | శిక్షణ పాఠశాలలను బేసిక్ విద్యావిధానానికి మార్చటం. ప్రభుత్వం వారివి (ఒక సెక్షను) | 0.380 |
| 32. | ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలలో అంబర్ చర్ఖా పథకం (2 పాఠశాలలు) | 0.010 |
| 33. | జిల్లా విద్యాశాఖాధికార్లకు జీపుల సరఫరా (ఒక జీపు) | 0.160 |
| 34. | రెండు ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలల్లో అదనపు సెక్షనులను ప్రారంభించటం | 0.160 |
| | మొత్తం | 8.619 |

## సెకండరీ విద్య

సెకండరీ విద్యాభివృద్ధికోసం యీ జిల్లాకు రు. 1.584 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగింపు పథకాలు** | |
| 1. | 1956–57 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షనులు | |

| | | |
|---|---|---|
| | (ఏ) స్థానిక సంస్థలవి (రెండు పాఠశాలలు రెండు సెక్షనులు) | 0.010 |
| | ఎయిడెడ్ (నాలుగు సెక్షనులు) | 0.020 |
| 2. | 1957-58 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షనులు | |
| | (ఏ) స్థానిక సంస్థలవి (ఒక పాఠశాల, రెండు సెక్షనులు) | 0.020 |
| | (బి) ఎయిడెడ్ (ఒక సెక్షను) | 0.010 |
| 3. | 1957-58 లో హైయ్యర్ సెకండరీ పాఠశాలలుగా మార్చబడిన ఉన్నత పాఠశాలలు | |
| | ఎయిడెడ్ (ఒక పాఠశాల) | 0.020 |
| 4. | ఉన్నత పాఠశాలలకు బిల్డింగు గ్రాంట్లు | |
| | (ఎ) స్థానిక సంస్థలు | 0.050 |
| | (బి) ఎయిడెడ్ వాటికి | 0.020 |
| 5. | హైయ్యర్ సెకండరీ పాఠశాలలకు భవనాలు | |
| | ఒక ఎయిడెడ్ పాఠశాల | 0.030 |
| 6. | సెకండరీ పాఠశాలల్లో ఉపాధ్యాయుల జీతాలు హెచ్చింపుకు | 0.700 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 7. | 1958-59 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షన్లకు గ్రాంట్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు | 0.100 |
| | (బి) ఎయిడెడ్ | 0.050 |
| 8. | మాధ్యమిక పాఠశాలలను (ప్రభుత్వంవారివి) ఉన్నత పాఠశాలల స్థాయికి పెంచడం; సెకండరీ పాఠశాలల్లో అదనపు సెక్షన్లను ప్రారంభించడం | 0.020 |
| 9. | ఉన్నత పాఠశాలలకు బిల్డింగు గ్రాంట్లు | |

| | | |
|---|---|---|
| | (ఏ) స్థానిక సంస్థలు | 0.100 |
| | (బి) ఎయిడెడ్ | 0.200 |
| 10. | ఉన్నత పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్యసామానుకు, పరికరాలకుగాను గ్రాంట్లు | |
| | (ఎ) స్థానిక సంస్థలు | 0.100 |
| | (బి) ఎయిడెడ్ | 0.100 |
| 11. | XI, XII తరగతుల విద్యార్థులకు స్కాలరు షిప్పులు | 0.004 |
| 12. | పార్టు సర్టిఫికేటు పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులు | 0.030 |
| | మొత్తం | 1.584 |

## యూనివర్సిటీ విద్య

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్శిటీ విద్యాభివృద్ధికోసం ప్రణాళిక మొదటి 3 సంవత్సరాలలో రు. 34.64 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడింది. ఈ సంవత్సరమునకుగాను ఆంధ్ర ప్రాంతానికి ప్రణాళికలో రు. 24.56 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 4.82 లక్షల మొత్తం ఈ క్రింది పథకాల కోసం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రు. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| | **క్రొత్త పథకాలు** | |
| 1. | ప్రభుత్వ కళాశాలల్లో 3 ఏళ్ళ డిగ్రీ కోర్సును ప్రవేశపెట్టడం | 0.82 |
| 2. | యూనివర్సిటీల అభివృద్ధికి గ్రాంట్లు (శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీకి) | 4.00 |
| | మొత్తం | 4.82 |



## ఇతర పథకాలు

క్రింద చూపినవిధంగా ఇతర పథకాలకోసం ఈ జిల్లాలో రు. 0.65 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడుతుంది.

| వరుస సంఖ్య. | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | ఎన్. సి. సి., ఏ. సి.సి. ల విస్తృతికి | 0.51 |
| 2. | స్కౌటింగు, గర్ల్‌గైడింగ్ అభివృద్ధికి | 0.02 |
| | **క్రొత్త పథకాలు** | |
| 3. | పంచాయతీ, ప్రైవేటు, సహకార, గ్రామసంఘ, స్థానిక సంస్థల గ్రంథాలయాలకు గ్రాంట్లు | 0.06 |
| 4. | హిందీ పాఠశాలలకు గ్రాంట్లు (ఒక పాఠశాల) | 0.03 |
| 5. | హిందీ ప్రేమీమండలులకు గ్రంథాలయ గ్రాంటులు | 0.01 |
| 6. | యువక సంక్షేమ కార్యక్రమాలకు | 0.01 |
| 7. | ఎన్. సి. సి, యూనిట్లలలో ఉన్న చౌకీదార్లకు జీతాలు పెంచుటకు | 0.01 |
| | మొత్తం | 0.65 |

## తిరుపతిలో శ్రీ వేంకటేశ్వరా పాలిటెక్నిక్ స్థాపన

1957—58 లో ఈ సంస్థ ప్రారంభించబడింది. రెండవ ప్రణాళికలో ఈ సంస్థకోసం రు. 22 లక్షలు కేటాయించబడినాయి. ఈ సంస్థ స్థాపన కోసం తిరుమలై—తిరుపతి దేవస్థానమునుండి రు. 9.549 లక్షల మొత్తం ఖరీదయ్యే భవనాలు కొనబడినాయి. 1957–58, 1958—59 సంవత్సరాల కాలంలో మొత్తం ఖరీదంతా వారికి చెల్లించబడింది. పరికరాల కొనుగోలుకు, సిబ్బంది జీతాల క్రింద, చిల్లర ఖర్చులకుగాను ఈ సంవత్సరములో ప్రణాళికయందు రు. 3.66 లక్షల మొత్తం కేటాయించబడింది.

# వైద్యం

## కాంపౌండర్లకు శిక్షణ

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు, ఇతర వైద్య సంస్థలకు కావలసివచ్చే కాంపౌండర్ల అవసరాన్ని తీర్చడంకోసం, రెండవ ప్రణాళికా కాలంలో అదనంగా 495 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వడానికి ప్రతిపాదించబడింది. జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులలోను, ఇతర టీచింగ్ ఆసుపత్రులలోను వున్న 11 శిక్షణ కేంద్రాలలో ఏటా 99 మందికి ఈ శిక్షణ ఇవ్వబడుతుంది. ఆ విధంగా 1956-57, 1958-59 సంవత్సరాల మధ్యకాలంలో 297 మంది కాంపౌండర్లకు శిక్షణ ఇవ్వబడింది. ఇంకా 99 మంది కాంపౌండర్లకు శిక్షణ ఇచ్చేటందుకు ఈ సంవత్సరంలో రు. 0.22 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.02 లక్ష చిత్తూరులో వున్న హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో 9 మంది కాంపౌండర్లకు శిక్షణ ఇవ్వటంకోసం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## జిల్లా కేంద్రాలలోని ఆసుపత్రుల అభివృద్ధి

రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 13.00 లక్షల మొత్తం ఖర్చుతో అదనంగా భవనాలను నిర్మించడం ద్వారాను, పరికరాలను సిబ్బందిని మొదలైనవాటిని సమకూర్చటం ద్వారాను ఆంధ్రప్రాంతంలోని జిల్లా ఆసుపత్రులకు అనేకమైన అభివృద్ధి పనులు చేయబడ్డాయి. జిల్లా ఆసుపత్రులను అభివృద్ధి పరచటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 9.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.50 లక్ష మొత్తం చిత్తూరులోని జిల్లా ఆసుపత్రికి అభివృద్ధి పనుల నిమిత్తం వినియోగించబడుతుంది.

## తాలూకా కేంద్రాలలోని ఆసుపత్రుల అభివృద్ధి

ఆంధ్రప్రాంతపు తాలూకా కేంద్రాలలో ఉన్న ఆసుపత్రులలో పడకల సంఖ్యను పెంచడం, అదనపు భవనాలను నిర్మించడంద్వారా వాటిని అభివృద్ధి చేయుటంకోసం రెండవ ప్రణాళికలోని మొదటి మూడు సంవత్స

రాల కాలంలో రు. 4.71 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడింది. తాలూకా ఆసుపత్రుల అభివృద్ధికిగాను ఈ సంవత్సరంలో రు. 1.60 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. పడకల సంఖ్యను పెంచడంమూలంగా ఈ జిల్లాలోని కొన్ని తాలూకా ఆసుపత్రులలో ఇంతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి, మదనపల్లి, పలమనేరులలో వున్న తాలూకా ఆసుపత్రులను ఈ సంవత్సరములో అభివృద్ధి పరచడానికిగాను పైడబ్బు వినియోగించబడుతుంది.

## లోకలు ఫండు ఆసుపత్రులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం

ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.95 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.24 లక్ష ఈ జిల్లాకు కేటాయించబడింది. 1956-57 సంవత్సరాలలో స్వాధీనంచేసుకోబడినట్టి పుత్తూరులోని ఆసుపత్రి నిర్వహణకు, వాయల్పాడు, చంద్రగిరిలలో వున్న ఆసుపత్రులను ఈ సంవత్సరం స్వాధీనం చేసుకొనుటకుగాను పైడబ్బు వినియోగించబడుతుంది.

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలోను ఆంధ్రప్రాంతంలో 10 క్షయ చికిత్సా కేంద్రాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ సంవత్సరంలో, ఇంకా 4 కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకు ముందు ప్రారంభించినవాటిని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష మొత్తం 1957-58 లో చిత్తూరులోని జిల్లా ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు

దేశంలో త్వరితగతిని జనాభా పెరగటంమూలంగా దేశం యొక్క పరిమితమైన ఆదాయమార్గాలపై అధికమైన ఒత్తిడి ఏర్పడుతున్నది. ఈ కార్య

కాలవల్ల కుటుంబనియంత్రణ, జనాభా పెరుగుదలను అరికట్టడం అవసర మైంది. ఇందువల్ల 1957–59 సంవత్సరాలలో ఆంధ్రప్రాంతంలో 13, తెలంగాణా ప్రాంతములో 7– మొత్తం 20 కుటుంబనియంత్రణ కేంద్రాలు స్థాపించబడినాయి. ఈ సంవత్సరంలో ఇంకా 15 కేంద్రాలను – 10 ఆంధ్ర లోను, 5 తెలంగాణాలోను– ప్రారంభించడానికి, ఇంతకుముందు ప్రారం భించిన వాటిని కొనసాగించడానికిగాను 1959–60 ప్రణాళికలో రు. 0.66 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.04 లక్ష ఈ జిల్లాలో వినియో గించబడుతుంది. తిరుపతిలోని ప్రభుత్వ ఆసుపత్రిలో కుటుంబ నియంత్రణ కేంద్రం ఏర్పాటుచేయడానికి, 1957–58 లో చిత్తూరులోని జిల్లా ఆసుపత్రిలో ప్రారంభించబడిన కేంద్రాన్ని నిర్వహించడానికి పైడబ్బు వినియోగించబడు తుంది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకం క్రింద గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చడానికి గాను బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు స్థాపించబడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం క్రింద రు. 15.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.00 లక్షల మొత్తం, ఈ జిల్లాకు ప్రత్యే కించబడింది. ఈ జిల్లాలో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని ఏర్పాటు చేయుటానికి ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన కేంద్రాలను కొనసాగించ డానికి, పైడబ్బు వినియోగించబడుతుంది.

## దంతవైద్య కళాశాల, దంతచికిత్సా కేంద్రాల ఏర్పాటు

ఈ పథకం క్రింద యీ సంవత్సరంలో రు. 3.06 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 2.50 లక్షల మొత్తం ఆంధ్ర ప్రణాళిక క్రింద రు. 0.56 లక్ష తెలంగాణా ప్రణాళిక క్రింద కేటాయించ బడినాయి. ఇంతకు ముందు ప్రారంభించిన దంత చికిత్సా కేంద్రాలను నిర్వహించటమే కాకుండా క్రొత్తవాటిని ప్రారంభించటానికి, హైదరా బాదులోని ఉస్మానియా వైద్య కళాశాలలో 1958–59 సంవత్సరంలో ఏర్పాటు చేయబడిన దంత చికిత్సా విభాగాన్ని కొనసాగించటానికి గాను యీ డబ్బు వినియోగించబడుతుంది. ఇందులో రు. 0.20 లక్ష చిత్తూరు

లోని జిల్లా ఆసుపత్రిలో 1956-57 లో ఏర్పాటు చేయబడిన దంత చికిత్సా విభాగాన్ని నిర్వహించుటకుగాను ప్రత్యేకించబడింది.

## భద్రాచలం, తిరుపతిలలో అంటువ్యాధి ఆసుపత్రులు

భద్రాచలం, తిరుపతిలలో అంటువ్యాధి ఆసుపత్రుల నిర్మాణం జరుగుతున్నది. 1959-60 లో యివి పూర్తవుతాయి. ఇందుకు రు. 1.50 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది.

## చెవి, ముక్కు, గొంతు చికిత్సాలయాలు

ఈ పథకం కోసం యీ సంవత్సరం రు. 0.30 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.06 లక్ష చిత్తూరులోని హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో 1958-59 లో ఏర్పాటు చేయబడిన చెవి, ముక్కు, గొంతు చికిత్సాలయాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## నేత్రచికిత్సాలయాలు

1958-59 లో 2 నేత్ర చికిత్సాలయాలు ప్రారంభించబడినాయి. ఈ సంవత్సరం యింకా మూడింటిని ప్రారంభించటానికి, ప్రస్తుతమున్న వాటిని నిర్వహించటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో చిత్తూరులోని హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో 1958-59 లో స్థాపించబడిన చికిత్సాలయాన్ని కొనసాగించుటకు రు, 0.06 లక్ష కేటాయించబడింది.

# ప్రజారోగ్యం

## దాయీలకు శిక్షణ

గ్రామీణ ప్రాంతాలలో యిండ్లలోనే కాన్పులుజరిగే పద్ధతిని మెరగు పరచటానికి గాను 1956-57 లో యీ శిక్షణ పథకం ప్రారంభించబడింది. వాటు మంత్రసానులు(దాయీలు)ఉత్తమపద్ధతుల్లో పురుళ్ళుపోయటం గురించి యీ పథకం క్రింద శిక్షణ ఇవ్వటంజరుగుతుంది. ఇందువల్లవారు తమ వృత్తిని నైపుణ్యంతో కొనసాగించు కొనుటకు వీలుకలుగుతుంది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో యీ పథకం

క్రింద శిక్షణ యివ్వడం నిమిత్తం 1,329 మంది అభ్యర్థులు చేర్చుకోబడినారు. యీ సంవత్సరంలో యీ పథకం కొనసాగించబడుతుంది. 720 మంది అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఇందుకుగాను రాజ్యప్రణాళికలో రు. 0.81 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 8,450/—లు ఈ జిల్లాలో 120 మంది అభ్యర్థులకు దాయీలుగా శిక్షణ యిచ్చుటకు వినియోగించబడతాయి.

## మలేరియా బ్యూరో విస్తరణ

మొదటి ప్రణాళికా కాలంలో ప్రారంభించబడిన 2 మలేరియా నివారణ యూనిట్లు 1956—57 లో కొనసాగించబడినాయి. 1957—58 లో అదనంగా మరో 2 యూనిట్లు ఏర్పాటు చేయబడినాయి. ఈ 4 యూనిట్లు కూడ 40 లక్షల మంది ప్రజలను మలేరియా బారినుండి రక్షించటం కోసం 1958—59 లో కొనసాగించబడినాయి. 1—4—1958 నుండి మలేరియా నివారణకు సంబంధించిన జాతీయ కార్యక్రమం మలేరియా నిర్మూలన కార్యక్రమంగా మార్చబడింది. ఈ కార్యక్రమం క్రింద అదనంగా మందులు చల్లే పరికరాలు, డి.డి.టి. మందును సరఫరా చేయడం ద్వారా మలేరియా వ్యాపించని ప్రదేశాలను కూడ కలుపుకుని రాజ్యంలోని అన్ని తావుల లోను మందులు చల్లే పని తీవ్రతరం చేయబడుతుంది. ప్రస్తుతం 17 సబ్-యూనిట్లతో కూడి యున్న 4 యూనిట్లను కొనసాగించడానికి, 16 హైపో ఎండమిక్ యూనిట్లను స్థాపించడానికి, ప్రజారోగ్య శాఖ ప్రాంతీయ అసిస్టెంటు డైరెక్టర్లను ముగ్గురిని నియమించటానికి గాను రాజ్య ప్రభుత్వ వాటా క్రింద ప్రణాళికలో రు. 22.99 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 1.87 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ప్రస్తుతం ఉన్న ఒక సబ్-యూనిట్టును కొనసాగించడానికి, ఒక హైపో-ఎండమిక్ యూనిట్టును ప్రారంభించడానికి యీ డబ్బు వినియోగించ బడుతుంది.

## బి. సి. జి. టీకాలు

క్షయ నివారణ కొరకు బి. సి. జి. టీకాలు వేసే కార్యక్రమము ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఒక కేంద్ర పరిపాలక యూనిట్టు తోను, 6 ఫీల్డు టీములతోను ప్రారంభించబడింది. మొదటి మూడు సంవత్స

రాల్లోను యివి కొనసాగించబడినాయి. 1959-60 లో పై కేంద్ర పరిపాలక యూనిట్టును, 6 ఫీల్డు టీములను కొనసాగించడమే గాక అదనంగా మరో 3 ఫీల్డు టీములను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. రాజ్య ప్రభుత్వ వాటా క్రింద ప్రణాళికలో యిందుకుగాను రు. 3.70 లక్షల మొత్తం కేటాయించబడింది. యీ సంవత్సరం ఏర్పాటు చేయబడే మూడు ఫీల్డు టీములు ఈ జిల్లాలో 6 నెలలపాటు పని చేస్తాయి. ఇందుకు రు. 0.655 లక్ష కేటాయించబడింది.

## ఆరోగ్యా ప్రచారం

ఆరోగ్య విషయాలను గురించి ప్రజలకు వివరించేటందుకుగాను ప్రజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో కేంద్ర ఆరోగ్య విద్యాప్రచార బ్యూరో ఒకటి 1957-58 లో ప్రారంభించబడింది. ఇంతకుముందు కొన్న 11 జీపులను, రెండు ఎపిడమిక్ కంట్రోలు మరియు ప్రచార వ్యానులను నిర్వహించడమే గాక మరో రెండు వ్యానులను కొనడంజరిగింది. క్రొత్త ఢిల్లీలోని కార్యాచరణ సంఘంవారు 1958-59 లో ఈ పథకాన్ని కొనసాగించుటకు సమ్మతించలేదు. అయినప్పటికీ ప్రస్తుతం జిల్లాలో ఉన్న 11 జీపులను, 4 వ్యానులను కొనసాగించడానికి, కేంద్ర ఆరోగ్య విద్యా బ్యూరోను కొనసాగించటానికి, యింకా 8 క్రొత్తవ్యానులను ఖరీదు చేయటానికి మరో 8 ఆరోగ్య ప్రచార బ్యూరోలను స్థాపించడానికి గాను 1959-60 లో రు. 4.15 లక్షల మొత్తం కేటాయించబడింది. కేటాయించబడిన రు. 4.15 లక్షల మొత్తంలో రు. 0.12 లక్ష ఈ జిల్లాలో ఉన్న ఒక జీపు, ఒక వ్యాను నిర్వహణకు గాను ప్రత్యేకించబడింది.

## పట్టణాలలో గృహ నిర్మాణం

### పట్టణాల్లో గృహ నిర్మాణ సహకార సంఘాలు

పట్టణ ప్రాంతాల్లో నివాస గృహాల కొరతను తీర్చటంకోసం సహకార పట్టణ గృహ నిర్మాణ సంఘాల సభ్యులకు ఇళ్లు నిర్మించుకొనేటందుకు గాను దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వటానికి యీ పథకం క్రింద ప్రతిపాదింపబడింది. ఆంధ్రలో క్రొత్తగా 340 గృహాల నిర్మాణం నిమిత్తం ఋణాలివ్వటంకోసం యీ సంవత్సరంలో రు. 20.00 లక్షల మొత్తం

కేటాయించబడింది. ఇందులో రు. 1.80 లక్ష ఈ జిల్లాలో 30 గృహాల నిర్మాణం నిమిత్తం ప్రత్యేకించబడింది.

## కార్మికులు-కార్మిక సంక్షేమం

### *ఉద్యోగ సమాచార సేకరణ*

ఈ పథకం యొక్క లక్ష్యాలేవంటే :

1. ఏరకం ఉద్యోగులు కొరతగా ఉన్నారన్న విషయాన్ని యింకా ఖచ్చితంగా నిర్ణయించడం కోసం ఉద్యోగసాధక కేంద్రాల అధికారులకు యింకా ఎక్కువ వివరాలను అందచేయటం,
2. విద్యాభ్యాసం పూర్తిచేసినవారికి, ఉద్యోగాన్వేషణలో ఉన్న ఇతర వ్యక్తులకు ఉద్యోగాలను గురించి ఉద్యోగ అవకాశాలను గురించి సలహాలనిచ్చే నిమిత్తం సమాచారాన్ని లభ్యం చేయటం,
3. ఉద్యోగసాధక కేంద్రం యొక్క పరిధిలో ఉండే ప్రాంతంలో గాని, లేక ప్రత్యేక ఎంప్లాయిమెంటు మార్కెట్లుగా ఏర్పాటు చేయబడే ఇతర ప్రదేశాలలోగాని ఉద్యోగ నియమావకాశాలలో వచ్చే మార్పులను గమనించడానికి తగిన విధానాన్ని రూపొందించడం.
4. ప్రతి పరిశ్రమలోను, వృత్తిలోను ఉద్యోగ, నిరుద్యోగ రీతులను గురించి ముందు సూచనలు చేయటం.

హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం, విజయవాడ, కర్నూలు లలోని ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాలలో యీ పథకం 1957–58 లో అమలుపరచబడింది. హైదరాబాదులోని నేషనల్ ఎంప్లాయిమెంటు సర్వీస్ డైరెక్టరేట్‌లో కేంద్ర యూనిట్టు ఏర్పాటు చేయబడింది. 1958–59 లో కాకినాడ, గుంటూరు, నిజామాబాదులలోని జిల్లాఉద్యోగ సాధక కేంద్రాలకు యీ పథకం విస్తరించబడింది. విశాఖపట్టణం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులలో ప్రయివేటు రంగానికి సంబంధించి 1959–60లో పరిశీలన జరిపేటందుకు ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను నేషనల్ ఎంప్లాయ్‌మెంట్ సర్వీసు డైరెక్టరేటులో ఏర్పాటు చేయబడిన కేంద్ర యూనిట్టును ఒక సీనియరు ఆఫీసరు అధ్వర్యంలో ఉంచబడడం ద్వారా

పటిష్టం చేయబడుతుంది. ఇంతేకాక పైన పేర్కొనబడిన ఉద్యోగ సాధక కేంద్రాలలో కూడ అదనపు సిబ్బంది నియమించబడుతుంది. ప్రతి ఉద్యోగ సాధక కేంద్రంలోను ఒక గుమాస్తాను నియమించడం ద్వారా మిగత అన్ని కేంద్రాలలోని సిబ్బందిని కూడ పెంచటానికి ప్రతిపాదింపబడింది.

ఈ పథకానికయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటా క్రింద 1959—60 ప్రణాళికలో రు. 0.31 లక్ష కేటాయించబడింది. ఇంతేకాక కేంద్ర ప్రభుత్వ వాటా క్రింద రు. 0.47 లక్ష కేటాయించబడింది. కేటాయించబడిన మొత్తం రు. 0.78 లక్షలో రు. 0.012 లక్ష యీ జిల్లాలోని కార్యక్రమమునకుగాను వినియోగించబడుతుంది.

## వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డుకులాల సంక్షేమం

### *షెడ్యూల్డు కులాలు- షెడ్యూల్డుకులాలవారికి స్కాలరుషిప్పులు*

విద్యాభ్యాసం చేసే అన్ని దశల్లోను హరిజన విద్యార్థులకు, అర్హులైన యితర కులాల విద్యార్థులకు స్కాలరుషిప్పులు యివ్వబడుతున్నాయి హైస్కూల్ విద్యార్థుల విషయంలో, వారి తల్లిదండ్రుల ఆదాయం రు. 1,500/- లకు మించనప్పుడు, కాలేజీ విద్యార్థుల విషయంలో వారి తల్లిదండ్రుల ఆదాయం రు. 1,800/- లకు మించనప్పుడు వారికి పూర్తి జీతం మినహాయింపు కలుగచేయబడుతుంది. అదనంగా దాదాపు 1,600 స్కాలరుషిప్పులు యివ్వడానికి ఇంతకుముందే మంజూరు చేసినవాటిని కొనసాగించడానికి గాను 1959—60 సంవత్సరానికి రు. 4.90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని అర్హులైన విద్యార్థులకు కూడ ఈ స్కాలరుషిప్పులు లభ్యమౌతాయి.

### *షెడ్యూల్డు కులాలవారికి సబ్సిడైజుడు హాస్టళ్లు*

ఆంధ్రప్రాంతంలో 438 సబ్సిడైజుడు హాస్టళ్ళు ఉన్నాయి. వెనుకబడిన తరగతులకు, హరిజన కులాలకు చెందిన విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు పటా యివ్వబడుతున్నాయి. ఒక్కొక్క విద్యార్థికి విద్యా సంవత్సరానికి రు. 150 లు గ్రాంటుగా యివ్వబడుతున్నది. అదనంగా యింకా 670 బోర్డింగు గ్రాంటులను యివ్వటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.00 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని హాస్టళ్ళకు కూడ బోర్డింగు గ్రాంటులు యివ్వబడతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి ప్రభుత్వ హాస్టళ్ళు

ఈ జిల్లాలోని చిత్తూరు, కుప్పం, మదనపల్లిలలో ఉన్న హాస్టళ్ళు ఈ సంవత్సరంలో రు. 0.22 లక్ష వ్యయంతో నిర్వహించబడతాయి.

## పాఠశాలలు, హాస్టళ్ళ భవనాల నిర్మాణం, వాటికి మరమ్మత్తులు

ఆంధ్రప్రాంతంలో సాంఘిక సంక్షేమ శాఖవారి ఆజమాయిషీ క్రింద నిర్వహింపబడుతున్న సాంఘిక సంక్షేమ పాఠశాలలు, సబ్సిడైజుడు హాస్టళ్లు అద్దె భవనాల్లో ఏర్పాటు చేయబడ్డాయి. ఇందువల్ల హరిజనుల సౌకర్యార్థం నిర్వహింపబడుతున్న సాంఘిక సంక్షేమ పాఠశాలలకు, సబ్సిడైజుడు హాస్టళ్ళకు పక్కా భవనాలను నిర్మించటానికి ప్రతిపాదింపబడింది. 25 పాఠశాల భవనాల నిర్మాణం నిమిత్తం 1959-60 ప్రణాళికలో రు. 1.00 లక్ష కేటాయించబడింది. ఇందులో 2 భవనాలు యీ జిల్లాలో రు. 0.09 లక్ష వ్యయంతో నిర్మించబడతాయి.

## పారిశుధ్య సౌకర్యాల ఏర్పాటు

హరిజనవాడలు సామాన్యంగా అపరిశుభ్రంగా ఉంటాయి. ఈ వాడలలో ఆరోగ్యకరమైన వాతావరణం కలుగచేయటానికి బాటలు, మరుగుదొడ్లు, స్నానపుగదులు, మంచినీటి బావులు మొదలయినవాటిని ఏర్పాటు చేయటం అవసరం. ఇందుకుగాను ఆంధ్రప్రాంతంలో 217 మంచినీటి బావులను త్రవ్వటానికి 1959-60 లో రు. 4.34 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో యీ జిల్లాలో 20 బావులు రు. 0.40 లక్ష వ్యయంతో త్రవ్వబడతాయి.

## ఇళ్ళ స్థలాల సేకరణ

ఈ పథకం క్రింద ఇళ్ళ స్థలాలను సేకరించి వాటిని ఉచితంగా హరిజనులకు యివ్వటంకోసం 1959-60 సంవత్సరానికి రు. 8.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.75 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ప్రచారం

అస్పృశ్యతను నిర్మూలించటం కోసం దానివల్ల కలిగే అనర్థకాలను గురించి ప్రచారం చేయడానికి వీటికి సంబంధించి వ్రాయబడిన ఉత్తమమయిన నాటకాలకు, యక్షగానాలకు బహుమతుల నివ్వడానికి పత్రికలకు సబ్సిడీలు ఇవ్వడానికి, పోస్టర్లు, కరపత్రాలు ముద్రించడానికి, హరిజన దినోత్సవాలు వర్ణాంతర భోజనాలు ఏర్పాటు చేయటానికి గాను 1959—60 ప్రణాళికలో రు. 0.40 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో యీ పథకాన్ని అమలుపరచటం కోసం రు. 0.035 లక్ష ప్రత్యేకించబడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

హరిజన సేవక సంఘము, భారత సేవక సమాజము, గిల్డ్ ఆఫ్ సర్వీసు, రెడ్ క్రాస్ సొసైటీ, రోటరీ క్లబ్బులు మొదలయిన అనేక స్వచ్ఛంద సంస్థలు హరిజనోద్ధరణకు పాటుపడుతున్నాయి. ఈ సంస్థలకు తగు ప్రోత్సాహం యిచ్చేటందుకు ఆర్థికసహాయం చేయబడుతుంది. ఇందుకు గాను 1959—60 ప్రణాళికలో రు. 0.60 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లా లోని స్వచ్ఛంద సంస్థలు కూడ యీ సహాయాన్ని పొందవచ్చు.

## గృహ నిర్మాణ పథకాలు

హరిజనులు ఎంత బీదవారంటే వారికి ఇళ్ళ స్థలాలను ఉచితంగా యిచ్చి నప్పటికీ యిళ్ళు స్వంతంగా కట్టుకోలేని స్థితిలో ఉన్నారు. ఇందువల్ల హరిజనులు ఇళ్ళు కట్టుకొనేటందుకు వారికి సబ్సిడీలను, ఋణాలను యివ్వ టానికి ప్రతిపాదింపబడింది. ఒక్కొక్క ఇంటికి రు. 750 లు ఋణం, సబ్సిడీ రూపంలో చెల్లించబడుతుంది. ఇందులో రు. 250 లు సబ్సిడీగాను రు. 500 లు ఋణంగాను యివ్వబడతాయి. అయితే ఈ సౌకర్యం పొందే ప్రతి వ్యక్తి కొంత లేబరుని, సామగ్రిని సమకూర్చుకో వలసి ఉంటుంది. వాటి విలువ పై మొత్తంలో చేరదు. హరిజనులతో కలసి నివసించేటందుకు యితర కులాలవారిని ప్రోత్సహించే నిమిత్తం, నిర్మించటానికి తలపెట్టిన ఇండ్లలో నూటికి 10 యిళ్ళు వెనుకబడిన తరగతుల వారికి ప్రత్యేకించబడినవి. ఈ జిల్లాలో 64 యిళ్ళను నిర్మించటం కోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.48 లక్ష కేటాయించ బడింది.

## వెనుకబడిన తరగతులు

### వెనుకబడిన తరగతుల విద్యార్థులకు స్కాలరుషిప్పులు

వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు స్కాలరుషిప్పులు ఇవ్వటం కోసం ప్రభుత్వం వారు ఏటా రు. 4.00 లక్షలు ఖర్చుచేస్తున్నారు. ఆంధ్రప్రాంతంలోని వివిధ పాఠశాలలలోను, కళాశాలలలోను చదువు కొంటున్న వెనుకబడిన తరగతుల విద్యార్థులకు అదనంగా యింకా 920 స్కాలరు షిప్పులు యివ్వటంకోసం ఈ సంవత్సరానికి రు. 2.74 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతుల విద్యార్థులకు కూడా యీ స్కాలరు షిప్పులు లభ్యమౌతాయి.

### వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు

ఉన్నతపాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకుంటూఉన్న వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు సబ్సిడైజుడు హాస్టళ్ళలో బోర్డింగు గ్రాంట్లు యివ్వబడుతున్నాయి. ఒక్కొక్క విద్యార్థికి విద్యా సంవత్సరానికి రు. 150 లు చొప్పున ఈ బోర్డింగు గ్రాంటులు యివ్వబడతాయి. అదనంగా 445 బోర్డింగు గ్రాంటులు మంజూరు చేయటం కోసం 1959–60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.67 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు కూడా యీ బోర్డింగు గ్రాంటులు లభ్యమౌతాయి.

### వెనుకబడిన తరగతుల వారి పిల్లలకు మధ్యాహ్నపు భోజనం

సాంఘిక సంక్షేమ శాఖవారిచే నిర్వహింపబడుతున్న పాఠశాలల్లో వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలు చేరటాన్ని ప్రోత్సహించేటందుకు తద్వారా అస్పృశ్యతా నివారణకు దోహదం చేసేటందుకు గాను రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభించబడిన నాటి నుండి సాంఘిక సంక్షేమ శాఖవారి పాఠశాలల్లో చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల పిల్లలకు మధ్యాహ్నపు భోజనాల ఏర్పాటు చేయబడింది. ఈ పథకం కోసం 1959–60 లో రు. 0.50 లక్ష ఖర్చు పెట్టడానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకు కూడ ఇందుమూలంగా లాభం చేకూరుతుంది.

## విముక్తజాతులు

### విద్య

విముక్తజాతులకు చెందిన పిల్లల తల్లిదండ్రులు తమ పిల్లల విద్యకు కావలసిన సదుపాయాలను కలుగజేసే స్థితిలో లేనందువల్ల ఈ పిల్లలు పాఠశాలలకు హాజరుకారు. ఇందువల్ల ఈ పిల్లలకు పుస్తకాలు, పలకలు, మొదలైనవి సరఫరా చేయటానికి ప్రతిపాదింపబడింది. పుస్తకాలు, పలకలు మొదలైనవి సరఫరా చేయటానికి, స్కాలరుషిప్పులు మంజూరు చేయటానికి, యింతేకాక చిత్తూరు జిల్లాలో విముక్తజాతుల వారికోసం నిర్మించబడిన కాలనీలలో ఏర్పాటు చేయబడిన రెండు పార్కులను, రెండు రేడియో సెట్లను నిర్వహించటానికిగాను 1959–60 ప్రణాళికలో రు. 0.09 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని విముక్త జాతులకు చెందిన పిల్లలకు కూడ యీ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

### గృహ నిర్మాణం

విముక్తజాతులవారు తమ నివాసగృహాలను నిర్మించుకోవటానికి యీ పథకం క్రింద సహాయం చేయబడుతుంది. వారు తమ పాకలను క్రొత్తగా నిర్మించుకోదలచినట్లయితే రు. 100/– లు విలువచేసే నిర్మాణ సామగ్రి సరఫరా చేయబడుతుంది. ప్రస్తుతమున్న యిళ్ళనే వారు మరమ్మత్తు చేసికోదలచినట్లయితే ప్రతి కుటుంబానికి రు. 30/–లు నగదు రూపంలో చెల్లించబడుతుంది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 100 క్రొత్త యిళ్ళ నిర్మాణానికి, 100 పాత యిళ్ళ మరమ్మత్తుకుగాను రు. 0.130 లక్ష కేటాయించబడింది.

### ప్రజారోగ్యం

ఈ జిల్లాలో రెండు క్రొత్త బావులను త్రవ్వడానికి, రెండు మరుగుదొడ్లను నిర్మించడానికి 1959–60 ప్రణాళికలో రు. 0.09 లక్ష కేటాయించబడింది. ఇంతేకాక ఈ జిల్లాలోని పుంగనూరు తాలూకాకు చెందిన సుగాలిమెట్టలో ఉన్న స్త్రీ సంక్షేమ కేంద్రం కొనసాగించబడుతుంది.

### వ్యవసాయం చేసుకోవటానికి సహాయం

ఈ పథకం క్రింద విముక్తజాతులవారికి ఆర్థికంగా సహాయ పడే టందుకు వారిని వ్యవసాయంలో స్థిరపరచేటందుకుగాను వారికి కాడిఎద్దులను సరఫరా చేయటానికి, పంపుసెట్లను నెలకొల్పటానికి, పాతబావులు మొదలైన వాటిని మరమ్మత్తులు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాకు 4 జతల కాడిఎద్దులను సరఫరా చేయటంకోసం 1959-60 సంవత్సరానికి రు. 1,200 లు కేటాయించబడినాయి.

### కుటీర పరిశ్రమలు

విముక్తజాతులవారు, తమ వృత్తులను కొనసాగించుకోవటంకోసం, ఈ పథకం క్రింద వారికి సహాయం చేయబడుతుంది. పరికరాలు, పనిముట్లు, ముడిపదార్థాల, రూపంలో ప్రతివ్యక్తికి రు, 50/- ల వరకు ఈ సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.15 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 1,750/-లు యీ జిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఇందుమూలంగా 35 మందికి లాభం చేకూరుతుంది.

### వైద్య సహాయం

ఈ పథకం క్రింద విముక్త జాతులకు చెందిన వ్యాధిగ్రస్తులయినట్టి అర్హులైన 50 మంది వ్యక్తులకు డిస్క్రిషనరీ గ్రాంటులు యివ్వబడతాయి. పై వ్యక్తులు తమకు కావలసిన మందులను కొనుక్కోవటానికి యితర ఖర్చులకు గాను ఒక్కొక్కరికి రు. 40/--లు చొప్పున యీ గ్రాంటు యివ్వబడుతుంది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 240/- లు ఈ జిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఈ జిల్లాలో విముక్తజాతులకు చెందిన 6 మందికి డిస్క్రిషనరీ గ్రాంటులు యివ్వటం కోసం యీ డబ్బు వినియోగించబడుతుంది.

## స్త్రీ సంక్షేమం

### ప్రస్తుతమున్న స్త్రీ సంక్షేమ శాఖ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమ శాఖ కార్యకలాపాలను తీవ్రతరం చేయటానికి, అవి మరింత ప్రయోజనకరంగా ఉండేటట్లు చేయటానికిగాను దృశ్యశ్రవణ

పరికరాలు, సౌండుప్రొజెక్టరు, విద్యాబోధన పటాలు, కెమెరాలు, రేడియోలు, సైకిళ్ళు, కుట్టు మిషన్లు మొదలయినటువంటి పరికరాలను ఇతర ముఖ్య సామాగ్రిని ఆంధ్రలో ప్రస్తుతమున్న 12 స్త్రీ సంక్షేమశాఖ విభాగాలకు రు. 0.10 లక్ష వ్యయంతో 1959—60 లో సరఫరా చేయడానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 900/—లు ఈ జిల్లాకు కేటాయించ బడినాయి.

## సాంఘిక సంక్షేమం

### *సాంఘిక సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు*

ప్రస్తుతం ఉన్న 2 సంక్షేమ విస్తరణ కేంద్రాలను, కో—ఆర్డినేటెడ్ ప్యాట్రన్ సంక్షేమ విస్తరణ కేంద్రాన్ని నిర్వహించటానికి, ఈ జిల్లాలోని మొదటిదశ బ్లాకులలో అదనంగా ఒక కో-ఆర్డినేటెడ్ ప్యాట్రన్ సంక్షేమ విస్తరణ కేంద్రాన్ని నెలకొల్పడానికి అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటా క్రింద యీ సంవత్సరానికి రు. 0.386 లక్ష కేటాయించబడింది. వీటికయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్రసాంఘిక సంక్షేమబోర్డు, రాజ్య ప్రభుత్వం 5:12:6 నిష్పత్తిలో భరిస్తాయి. ప్రజలనుండి సేకరించబడే మ్యాచింగు కంట్రిబ్యూషన్లు కూడా ఇందుకు తోడవుతాయి.

### *సాంఘిక, నైతిక పునరుద్ధరణ కార్యక్రమాలు*

కరెక్షనల్ ఇనిస్టిట్యూషన్సు నుండి విడుదల అయ్యే స్త్రీలకు గాను రాజ్యస్థాయిలో ఒక సదనాన్ని నెలకొల్పేటందుకు, 14 జిల్లా ఆశ్రయ కేంద్రాలను (3 పురుషులకు, 11 స్త్రీలకు) నెలకొల్పేటందుకు, యింతేకాక రాజ్యంలో యిదివరకే నెలకొల్పబడిన రాజ్యస్థాయి సదనాలను, జిల్లా ఆశ్రయ కేంద్రాలను కొనసాగించేటందుకు అయ్యే ఖర్చులో రాజ్యప్రభుత్వ వాటా క్రింద 1959—60 ప్రణాళికలో రు. 6.32 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.153 లక్ష, ఈ జిల్లాలో స్త్రీలకుగాను ఒక జిల్లా ఆశ్రయ కేంద్రాన్ని ఏర్పాటు చేయుటకుగాను ప్రత్యేకించబడింది.

### *భిక్షక గృహం*

భిక్షుక వృత్తిచే జీవించేవారికి ప్రాథమిక విద్య గరపటానికి, పాద రక్షలు తయారుచేయటం, వడ్రంగం, నేతపని, దర్జీపని మొదలయిన చేతి

పనులలో శిక్షణ యివ్వటానికిగాను వారికోసం ఒక ఆశ్రయ కేంద్రాన్ని 1959–60 లో ఈ జిల్లాలోని తిరుపతిలో ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింప బడింది. ఈ కేంద్రంలో భోజన, వైద్యసదుపాయాలు కలిగించబడుతాయి. ఇందుకు రు. 0.40 లక్ష గ్రాంటు–ఇన్–ఎయిడ్ పథకం క్రింద ఖర్చుపెట్ట బడుతుంది.

## మునిసిపల్ రోడ్లు, అభివృద్ధి పనులు

మున్సిపాలిటీల యొక్క, రెండు పట్టణపంచాయతీల యొక్క ఆదాయమార్గాలను అభివృద్ధిచేసే ఉద్దేశంతోను, ప్రజలకు పౌరసౌకర్యాలను అదనంగా సమకూర్చే ఉద్దేశంతోను దీర్ఘకాలిక ఋణాల రూపంలో ఆర్థిక సహాయం చేసేటందుకు గాను రెండవ ప్రణాళికలో రు. 47.54 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 21.42 లక్షల మొత్తం మొదటి మూడుసంవత్సరాల కాలంలో ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరానికి గాను రు. 11.59 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష 1958–59 లో టౌను ప్లానింగు డైరెక్టరు కార్యాలయంలో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించటానికి వినియోగించబడుతుంది. మిగత రు. 11.44 లక్షల మొత్తంలో రు. 1.14 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది. అప్పుమొత్తం, అప్పు యివ్వబడే స్థానిక సంస్థపేరు, ఎందునిమిత్తం యీ అప్పు యివ్వబడుతున్నది—యీ వివరాలు క్రింద యివ్వబడినాయి.

| స్థానిక సంస్థ పేరు | పని పేరు | అప్పు మొత్తం (రూ.లక్షలలో) |
|---|---|---|
| తిరుపతి పురపాలక సంఘం | కాయగూరల మార్కెట్టుకు అభివృద్ధి పనులు | 0.30 |
| చిత్తూరు పురపాలక సంఘం | బండ్ల, బస్సుల స్టాండుకు అభివృద్ధి పనులు | 0.50 |
| కాళహస్తి పురపాలక సంఘం | బస్సుస్టాండువద్ద సౌకర్యాలను కలిగించటం | 0.14 |
| మదనపల్లి పంచాయితి | క్లాక్‌టవర్ వద్దనున్న బస్సుల, బండ్ల స్టాండులవద్ద ప్రయాణీకులకు షెడ్లను నిర్మించటం | 0.20 |
| | మొత్తం | 1.14 |

# రేడియో ప్రసారం

## కమ్యూనిటీ రేడియో సెట్ల స్థాపన, నిర్వహణ

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో 427 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి ప్రతిపాదించబడింది. ఇందులో 227 సెట్లు మాత్రం 1956–59 సంవత్సరాల కాలంలో ఈ జిల్లాలో నెలకొల్పబడినాయి. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 100 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి, 1–4–1959 తేదీకి పూర్వం నెలకొల్పబడిన అన్ని సెట్లను నిర్వహించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.327 లక్ష మొత్తం కేటాయించబడింది.

# ప్రచారం

రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలు పరచటం కోసం ప్రణాళికను గురించి ప్రజలలో శ్రద్ధానక్తులు కలిగేటట్లు చేసేటందుకు, వారి సంపూర్ణ సహకారాన్ని పొందేటందుకు, వారు యీ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొనేటట్లు చేసేటందుకు గాను వివిధ ప్రచార సాధనాల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలను గురించి ప్రచారం చేయటం కోసం 1956–57 లో ఏకీకృత కార్యక్రమం ఒకటి ప్రారంభించబడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.80 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 44,117/– లు యీ జిల్లాలో క్రింది విధంగా వినియోగించబడతాయి.

| | | రూపాయలు లక్షలలో |
|---|---|---|
| 1. | పర్సనల్ అసిస్టెంటుకు యితర సిబ్బందికి జీతాలు | 5,987 |
| 2, | సంచార ప్రచార వ్యానులకు పెట్రోలు, ఇతర ఖర్చులకు | 1,200 |
| 3. | జిల్లా స్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలలో పాల్గొనేటందుకు | 250 |
| 4. | సంగీత నాటకోత్సవాలు ఏర్పాటు చేయడానికి | 500 |

| | | |
|---|---|---|
| 5. | జిల్లా తాలూకా ప్రధాన కేంద్రాలలో ప్రణాళికా వారోత్సవాలు ఏర్పాటు చేయటానికి | 900 |
| 6. | జిల్లాలలో పని చేస్తున్న బుర్రకథ దళాల నిర్వహణకు | 1,520 |
| 7. | ప్రస్తుతమున్న పబ్లిక్ గ్రంథాలయాలలో పైలెట్ ప్రాతిపదికపై సమాచార కేంద్రాలను నిర్వహించటం | 960 |
| 8. | సంచార వ్యాను సమకూర్చటం | 32,800 |
| | మొత్తం | 44,117 |

## అర్థగణాంక శాఖ

1958–59 లో యీ జిల్లాలో ఒక జిల్లా గణాంకశాఖ ఏర్పాటు చేయబడుతుంది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్‌వెస్టిగేటరు, ఒక అప్పరు డివిజను గుమాస్తా, ఇద్దరు జవానులు, యిందులో నియమించబడతారు. జిల్లా స్థాయిలో రాజ్యం యొక్క గణాంక కార్యక్రమాలను సమన్వయ పరచడానికి, సేకరించబడి సంకలనం చేయబడే గణాంక వివరాలలో లోపాలులేకుండా ఉండేటట్టు చేయడానికి లయజన్ ఏజన్సీగా జిల్లా గణాంక విభాగం పనిచేస్తుంది. ఇందుకుగాను 1959–60 ప్రణాళికలో రు. 0.10 లక్ష ఈ జిల్లాకు కేటాయించబడింది.

## తంతి, తపాలా సౌకర్యాలు

1959–60 లో 40 తపాలా ఆఫీసులను తెరవటానికి, యింతేకాక నరసింగపురం, కాటూరు, రొంపిచెర్లలలో 3 టెలిగ్రాఫ్ (కంబైండు) ఆఫీసులను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. పుత్తూరు, పీలేరులలో రెండు టెలిఫోను ఎక్స్‌ఛేంజీలను, నరసింగపురంలో ఒక పబ్లిక్ కాల్ ఆఫీసును ఏర్పాటు చేయటానికి కూడ ప్రతిపాదింపబడింది.

## రైలు మార్గాలు

చిత్తూరు జిల్లాలో 1959–60 లో రైలు మార్గాలకు సంబంధించి క్రింది కార్యక్రమం అమలుజరుపబడుతుంది.

| వరుస సంఖ్య | పని పేరు | అంచనా వేయబడిన ఖర్చు వేల రూపాయలలో |
|---|---|---|
| 1. | గుంతకల్లు, ధర్మవరం, పాకాల, కాట్పాడి సెక్షను — లైన్ కెపాసిటీ పనుల నిర్వహణ క్రాసింగ్ స్టేషనులను ఏర్పాటు చేయటం. | |
| | (i) గూలపాళ్యం, ఖాదరుపేట (వెంకటంపల్లి హాల్ట్ కన్వర్షను)<br>(ii) జంగాలపల్లి, ధర్మవరం (చిగిచెర్ల హాల్ట్ కన్వర్షను | 688 |
| 2. | హాస్పేటు, గుంతకల్లు, రేణిగుంట సెక్షను — రవాణాను అధికం చేయటానికి వీలుగా 26 స్టేషనులలో అదనపు సౌకర్యాలను కలిగించటం | 12,733 |

# చిత్తూరు జిల్లా ప్రణాళిక, అభివృద్ధి సంఘం

## సభ్యుల జాబితా

### I రెవిన్యూ అధికార్లు

1. కలెక్టరు
2. జిల్లా ప్లానింగు ఆఫీసరు
3. కలెక్టరు యొక్క పర్సనల్ అసిస్టెంటు
4. సబ్-కలెక్టరు, చంద్రగిరి
5. సబ్-కలెక్టరు, మదనపల్లి
6. డిప్యూటి కలెక్టరు మ్యానేజరు, కాళహస్తి
7. డిప్యూటి కలెక్టరు మ్యానేజరు, తిరుత్తణి
8. జిల్లా పబ్లిసిటీ అసిస్టెంటు, చిత్తూరు
9. జిల్లా సంక్షేమ శాఖాధికారి, చిత్తూరు
10. వై. ఆర్. డిప్యూటి తహశీల్దారు, చిత్తూరు.

### II వ్యవసాయ శాఖాధికార్లు

1. వ్యవసాయశాఖ డిప్యూటి డైరెక్టరు, కడప
2. జిల్లా వ్యవసాయ శాఖాధికారి
3. అదనపు జిల్లా వ్యవసాయశాఖాధికారి
4. అసిస్టెంటు అగ్రికల్చరల్ ఇంజనీరు, జిల్లా సర్వీసు స్టేషను

### III పశుగణాభివృద్ధి శాఖాధికార్లు

1. జిల్లా పశువైద్య శాఖాధికారి, చిత్తూరు

## IV రేడియో ప్రసార శాఖాధికార్లు

1. అసిస్టెంటు రేడియో ఇంజనీరు, చిత్తూరు

## V సహకార శాఖాధికార్లు

1. సహకార సంఘాల డిప్యూటి రిజిస్ట్రారు, చిత్తూరు
2. సహకార సంఘాల డిప్యూటి రిజిస్ట్రారు, తిరుపతి

## VI ఇంజనీరింగు శాఖాధికార్లు

1. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, పి. డబ్ల్యు. డి., మదనపల్లి
2. డివిజనల్ ఇంజనీరు (రహదార్లు)
3. డివిజనల్ ఎలక్ట్రికల్ ఇంజనీరు (ఆపరేషన్)
4. ఎగ్జిక్యూటివ్ ఎలక్ట్రికల్ ఇంజనీరు (కన్‌స్ట్రక్షన్)
5. అసిస్టెంటు ఇంజనీరు (ప్లానింగు)

## VII విద్యా శాఖాధికార్లు

1. జిల్లా విద్యాశాఖాధికారి
2. ప్రత్యేక జిల్లా విద్యాశాఖాధికారి

## VIII అటవీ శాఖాధికార్లు

1. జిల్లా అటవీ శాఖాధికారి, (తూర్పు), చిత్తూరు
2. జిల్లా అటవీ శాఖాధికారి, (పడమర) చిత్తూరు
3. వర్కింగు ప్లాన్ ఆఫీసరు (తూర్పు) చిత్తూరు
4. వర్కింగు ప్లాన్ ఆఫీసరు (పడమర) చిత్తూరు

## IX మత్స్యసంవర్ధన శాఖాధికార్లు

1. ఇనస్పెక్టర్ ఆఫ్ ఫిషరీస్, చిత్తూరు
2. అసిస్టెంటు డైరెక్టరు ఆఫ్ ఫిషరీస్, అనంతపురం

## X ఆరోగ్య శాఖాధికార్లు

1. జిల్లా ఆరోగ్య శాఖాధికారి, చిత్తూరు
2. నేషనల్ మలేరియా కంట్రోలు ఆఫీసరు, నెల్లూరు

## XI పరిశ్రమల శాఖాధికార్లు

1. పరిశ్రమల శాఖ అసిస్టెంటు డైరెక్టరు, చిత్తూరు

## XII లోకల్ బోర్డు అధికార్లు

1. జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరు యొక్క పర్సనల్ అసిస్టెంటు
2. జిల్లా పంచాయతీ ఆఫీసరు
3. చిత్తూరు పురపాలక సంఘం అధ్యక్షుడు
4. తిరుపతి పురపాలక సంఘం అధ్యక్షుడు

## XIII వైద్య శాఖాధికార్లు

1. జిల్లా మెడికల్ ఆఫీసరు

## XIV జాతీయ పొదుపు ఉద్యమ శాఖాధికారులు

1. జిల్లా నేషనల్ సేవింగ్స్ ఆర్గనైజరు

## XV పోలీసు అధికారులు

జిల్లా పోలీసు సూపరింటుండెంటు

## XVI గణాంక శాఖాధికారులు

1. జిల్లా గణాంకాధికారి

## XVII రవాణా శాఖాధికారులు

1. రీజినల్ ట్రాన్స్‌పోర్టు ఆఫీసరు

## XVIII స్త్రీ సంక్షేమ శాఖాధికారులు

అసిస్టెంటు ఉమన్ వెల్‌ఫేర్ ఆఫీసరు

## పార్లమెంటు సభ్యులు

1. శ్రీ ఎం. అనంతశయనం అయ్యంగార్, బి. ఎ., బి. ఎల్., తిరుపతి
2. శ్రీ ఎ. బలరామ రెడ్డి, బి. ఎస్. సి., ఎం. పి., కాళహస్తి
3. శ్రీ వి. గంగాధరశివ, ఎం. పి., రాయచోటి
4. శ్రీ టి. న్. విశ్వనాథ రెడ్డి, బి. ఎస్. సి., ఎం. పి., మదనపల్లి

## విధాన సభ సభ్యులు

1. శ్రీ ఎన్. సంజీవరెడ్డి, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, హైదరాబాదు.
2. శ్రీ పి. సింగారయ్య, కాళహస్తి.
3. శ్రీ పి. తిమ్మారెడ్డి, బి. ఎస్. సి., వ్యవసాయం, అటవీశాఖలమంత్రి
4. శ్రీ ఆర్. గోపాల్ రెడ్డి, తిరుత్తణి
5. శ్రీ ఎం. దొరైకణ్ణు, పెద్దకలకటూరు, తిరుత్తణి.
6. శ్రీ ఎస్. రంగనాథ మొదలియారు, బి. ఎ., బి. ఎల్., చిత్తూరు.
7. శ్రీ పి. రాజగోపాలనాయుడు, బి. ఎ., దిగువ మాఘం, చిత్తూరు
8. శ్రీ పి. చిన్నమ రెడ్డి, పెరియంబాడి, చిత్తూరు.
9. శ్రీ ఎస్. పి. చెంగల్రాయనాయుడు.
10. శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు, బి. ఎ., బి. ఎల్., కార్వేటినగరం.
11. శ్రీ నాదముని రెడ్డి, నరసింగపురం, చంద్రగిరి తాలూక
12. శ్రీ ఎస్. వెంకటాద్రిమనాయుడు, చంద్రగిరి తాలూక.
13. శ్రీ టి.ఎన్. వెంకటసుబ్బా రెడ్డి, బి.ఏ.,బి.ఎస్.సి. (ఆనర్సు) మదనపల్లి
14. శ్రీ టి. గోపాలకృష్ణగుప్త, మదనపల్లి.
15. శ్రీ డి. రామబ్రహ్మం, కుప్పం, పలమనేరు తాలూక
16. శ్రీ ఆర్. రత్నం, చప్పిడిపల్లి, పలమనేరు తాలూక
17. శ్రీ రాజవీర బసవ చిక్కరాయలు, వై.బి. జమీందారు, పుంగనూరు

## విధానమండలి సభ్యులు

1. శ్రీ కె. ఆదికేశవులునాయుడు, ముంగిలిపుట్టు, చంద్రగిరి తాలూక.
2. శ్రీ ఎస్. గోవిందరాజులునాయుడు, వైస్ ఛాన్స్‌లర్, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటి, తిరుపతి.
3. శ్రీ ఎన్. ఎం. విలియమ్స్, మిషన్ కాంపౌండు, రేణిగుంట.

## బ్లాకు కమిటీలు, పంచాయతి సమితుల అధ్యక్షులు

1. శ్రీ ఎ. కన్నయ్యనాయుడు నగరి, (నగరి–రెండవదశ బ్లాకు)
2. శ్రీ వెంకటపతినాయుడు పూనిమడుగు (పల్లిపేట–రెండవదశ బ్లాకు)
3. శ్రీ చంద్రశేఖరరెడ్డి (చిన్న గొట్టిగల్లు–రెండవదశ బ్లాకు)
4. శ్రీ జి. నరసింహారెడ్డి, గుడిబండ (వాయల్పాడు–రెండవదశ బ్లాకు)
5. శ్రీ ఎన్. సి. రామిరెడ్డి, కలికిరి (కలికిరి పంచాయితీసమితి బ్లాకు)

## అనధికార సభ్యులు

1. శ్రీ ఆర్. గురప్పనాయుడు, తిరుత్తణి తాలూకా సభ్యుడు
2. శ్రీ బుదూరు రామాంజులురెడ్డి, చివ్వాడ, తిరుత్తణి తాలూక
3. శ్రీమతి రామరత్నమ్మ, కాళహస్తి పంచాయితీ బోర్డు సభ్యురాలు
4. శ్రీ కాపిరెడ్డి గంగరామరెడ్డి, ఉరందూరు, కాళహస్తి తాలూక
5. శ్రీ ప్రతుపె సుందరరెడ్డి, చెంబేడు, కాళహస్తి తాలూక
6. శ్రీ ఆర్. పార్థసారథి, జాయింట్ సెక్రటరీ, హరిజన సేవక సంఘం, తిరుపతి
7. శ్రీ బి. వి. సుదర్శనవర్మ, అధ్యక్షుడు, మోటారు వర్కర్సు యూనియన్, కార్వేటినగరు
8. శ్రీ వి. మునుస్వామియప్ప, జిల్లా ప్రచారకుడు, హరిజన సేవక సంఘం, చిత్తూరు

9. శ్రీ వి. రామమూర్తి, చిత్తూరు, భారత సేవక సమాజం కన్వీనరు
10. శ్రీ కె. ఎం. రామయ్య, చౌడేపల్లి, పుంగనూరు తాలూక
11. శ్రీ ఆర్. చెన్నా రెడ్డి, చెర్ల, పుంగనూరు తాలూక
12. శ్రీ కె. వి. జగన్నాథం. అప్లాయిగుంట, పుత్తూరు తాలూక
13. శ్రీ వి. రామస్వామి రెడ్డి, సదం, పుంగనూరు తాలూక
14. శ్రీ టి. సి. రాజన్, పలమనేరు
15. శ్రీ పి. ఎం. రామమూర్తి, వెంకటగిరికోట
16. శ్రీ మురాద్ షా, మదనపల్లి
17. శ్రీ జి. శ్రీరామిరెడ్డి. చింతపర్తి, వాయల్పాడు తాలూక
18. శ్రీ ఎం. ఎన్. త్రిలోకికర్ దాబ, వాయల్పాడు

